# ఉత్తరాలు

## సైతాన్ తుఫాన్

మీ [మా] ఆంధ్రపత్రికలోని [9—12—77] కోస్తాను కబళించిన తుఫాన్ రక్కసి వ్యాసము చదివి విషాదంలో మునిగిపోయాను. వీరాజీగారు తుఫాన్ బీభత్సాన్ని కళ్ళకు కట్టినట్లుగా రచించారు. ఈ తుఫాన్ రక్కసి వాడికోరలకు అందకుండా ప్రాణాలతో బయటపడిన నిర్భాగ్యులకు మన అండ దండలు చూపించుటే ప్రస్తుత కర్తవ్యం.

వి. రవికుమార్, (కర్నూలు.)

* * *

9—12—77వ తేదీ ఆంధ్రసచిత్రవారపత్రికలో తుఫాను, ఉప్పెన, జలప్రళయ మూప్పెనగా విరుచుకపడి, నవంబరు 19వ కాళరాత్రిగా మార్చి, దేశానికి అన్నదాత అన్నపూర్ణగా వాసికెక్కిన ఆంధ్ర మాతకు, గర్భశోకాన్ని, అపారమైన ధన మాన ప్రాణ నష్టాలను కలిగిస్తూ ప్రళయ భీకరంగా ప్రకృతి సాగించిన కరాళనృత్యం దృశ్యాలు చూస్తుంటే నాకు ఏడుపొచ్చింది.

అల్లమాలు రామారావు (కలకత్తా.)

* * *

నటి శకుంతల ముఖచిత్రంతో వెలువడిన ఈ వారం పత్రికలో తుఫాను గురించిన వ్యాసం చాలా విషాదకరంగా ఉంది.

లోయ శివకేశవరావు (హైదాబాదు.)

* * *

శకుంతల ముఖచిత్రంతో వెలువడిన మీ [మా] ఆంధ్రపత్రిక మనోరంజకంగా ఉన్నా, ఆంధ్రప్రదేశ్ తుఫాను, ఉప్పెనకు గురైన విదారకరమైన దృశ్యాలు చూశాక, వేరే శీర్షికలు చదవ వీలులేకుండా నాకళ్లు కన్నీటి పొరలతో నిండి పోయాయి.

కోట వెంకటరమణ, (బరంపురం.)

## తాజాకాలమ్

9—12—77 నాటి ఆంధ్రసచిత్ర వార పత్రిక ముఖచిత్రము [నటి శకుంతల] గారిది ఆ వారం పత్రికకే శోభాయమానము. మీరు ప్రచురించిన తాజాకాలమ్ గమనార్హము. ఇక అపస్వరాలు కథ చాలచాలా బాగున్నది. రచయితగార్కి నా అభివందన ములు. ఇదే నా మొదటి ఉత్తరము. మాలాంటి వారికి మీ [మా] పత్రికలో చోటుంటుంది అని ఆశిస్తూ.......

మంత్రి లక్ష్మయ్య, (పెంబర్తి)

* * *

డిశంబరు 77వ నాటి ఆంధ్రసచిత్రవారపత్రికలో వీరాజీగారి తాజాకాలమ్‌లో కోస్తాను కబళించిన తుఫాన్ రక్కసి చదివి, అందులో వున్న చిత్రాలు చూసి మా కుటుంబం యావన్మందీ కన్నీళ్లు కార్చలేక వుండలేకపోయాము. దినపత్రికలో భయంకరమైన చిత్రాలు, గుండెగుబులు చేసే వార్తలు వినలేకపోయాము. భారతభూమిలో బంగారం పండించే ఆంధ్రభూమిని బూడిదచేసే ఉప్పెన నీకేమాత్రం కనికారం లేకపోయిందా!

(అనారా ఖర్గపూర్)

## గొప్ప చిక్కు

ఈ వారం (11—11—77) పత్రికలో ఒకేఒక్క కథ ప్రచురించడం, అసంతృప్తిగా వున్నా వున్న ఆ ఒక్క కథ ఎంతో ఆసక్తికరంగా వుంది. ఇక మాయా జాలం మతికట్టు విషయంలో ఇంద్రజాల ప్రదర్శనవివరములు, వాటిలోని కిటుకులు చదువుతుంటే ఎంతో ఆశ్చర్యం వేస్తున్నది. ఇలాంటి ప్రదర్శనలు నేను స్నేహితుల వద్ద చేద్దామనుకుంటే (ఏదో సరదాగా) అందు లోని కిటుకులు కూడా వారు ముందే గ్రహించి వుంటారు. ఎందుకంటే ఆంధ్ర సచిత్ర వార పత్రికను చాల మంది చదువుతుంటారు గదా! మరి ఇలాంటి ప్రదర్శనలు ఎవరివద్ద ఇవ్వాలి ఇక ?

పుల్లగూర సుబ్రమణ్యం, (కదిరి)

## కథలు

9—12—77 మీ పత్రికలో అపస్వరాలు చదివాను. మనసంతా ఎట్లాగో అయింది. రచయితకు నా అభినందనాలు. ఇకపోతే తాజాకాలమ్‌లో సైతాన్ తుఫాన్ చదివాను. ఆ దురదృష్టవంతుల మీద చెప్పలేని జాలి కలిగింది. మనసంతా బాధతో నిండి పోయింది. ఇలా ఎందుకు జరిగింది అని దేవుడు కనిపిస్తే అడగాలని ఉంది.

శ్రీమతి మల్లికారాజు (చంద్రగిరి.)

(49వ పేజీ చూడండి)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938-1972]

శుక్రవారం : 30-12-'77
పింగళనామ సం. మార్గశిర బ. పంచమి
సంపుటము 71 సంచిక 15

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

పోస్టుతో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



అట్టమీద బొమ్మ
నటి
(ఫోటో : జె. పి)



లోకం పోకడ











"దొంగా డొచ్చాడంటండి మాయ్య గారోఁ !"

అరుస్తూ వచ్చాడు పోలయ్య, ఉరఫ్ పోలీసు.

బనీనూ; చలిబనీనూ తొడిగి. వాటిమీద దుప్పటి బిగించి, వీధిచానిట్లో పడక్కుర్చీలో నడుం జేరేసి, చుట్ట ముట్టించి, బుద్ధ భగవానుడు ప్రపంచానికిచ్చిన సందేశాన్ని తెలుగు వారికి తెలియజేయాలన్న నిశ్చయంతో—దిట్టమయిన సంస్కృత పదాలను ఛందోబద్ధం చేసే ప్రయత్నంలో— మైమరచిన వెంకటేశ్వర్లు వెన్నులో ఒక్కమారుగా వణుకు పుట్టింది.

"నిజమేరా ?"

"యింకా పూళ్ళోకంటూ రాలేదండీ... మన సత్తెయ్యండీ... ఆడేవండీ సైకిలు మీదెళ్లి పాలమ్మ కొత్తాడు గాదండి... ఆడండీ... ఆడు తీసుకొత్తన్నాడండి ... !"

"దొంగాడేంటీ... తీసుకు రాడవేంటీ? తాగొచ్చేవేంట్రా"

"అమ్మతోడండి. ! అవుతే మీకు తెల్దన్న మాటండి... వూరు వూరంతా నండి మాయ్యగోరోఁ! ... సెరువు గట్టుమీదే ఉన్నారండి... దొంగాడంటండి... పెద్దాపురంలో దొరికాడంటండి,.!"

వెంకటేశ్వర్లుకో యిరవై ఎకరాల పైచిలుకు మెరకా పల్లం; అక్కడికో అర మైలు కెక్కువా మైలుకు లోపూ దూరంలో వున్న ఏలేటిపాడు 'జిన్నుబావయ్య ఉన్నత పాఠశాల'లో అన్‌ట్రైన్డ్ తెలుగు టీచరు ఉద్యోగం వున్నాయి. వాటికితోడు ఇంజక్షన్ పొడవటం నేర్చుకుని యింగ్లీషు వైద్యుడు గానూ... సంస్కృత శ్లోకాలూ కొన్ని భస్మాలపేర్లూ తెలుసుకొని ఆయుర్వేద వైద్యుడుగానూ... వ్యవహరిస్తూ 'ప్రజా సేవ చేయటం' ఉంది. లోపాయకారీ వడ్డీ వ్యాపారం వుంది. ఇన్ని ఉన్న అతగాడికి పోలీసు మోసుకొచ్చిన వార్త ఆశ్చర్యం కన్న భయాన్నే కలిగించింది.

"నువ్వనేదేంటో నాకు బోధపడిచావటం లేదు..."

"నాకూ నమంగా తెల్దండి! సెరువు కాడికి రండి... నా నొత్తావండి."

పరుగు దీసాడు పోలీసు.

కులాన్నిబట్టి ధైర్యంగా ఉండవలసిన వాడు... తోటి ఉద్యోగస్తుల సావాసంవల్లేనేమో... ఆ క్షణంలో పిరిగ్గొడ్డయిపోయాడు వెంకటేశ్వర్లు. అంత లావు మనిషి అమాంతంగా లేచి మందువాలోకి అడుగుపెడుతూనే పెళ్లాన్ని కేకేసాడు.

కాళ్ళకి కడియాలూ, పట్టెడా... మెళ్లో నాలుగుపేటల జిరిపోతులాంటి చంద్రహారంతో పరుగెత్తుకు వచ్చింది వెంకటేశ్వర్లు పెళ్లాం !

"అలాగే మెళ్లో అన్నీ దిగేసుకుని గంగిరెద్దులా తిరుగు! వూళ్లోకి దొంగా 'డొత్త'న్నాడు...! అన్నీ 'శ్రమ' లేకుండా మూటగట్టుకుని వెళ్లిపోతాడు! యెదవ మొఖమా! పాలికాపు లెవరున్నారు ?"

"దొంగాడంటావేటీ...!"

"అయింది...! నీకన్నీ యిడమరిచి చెప్పేసరికి వాడన్నీ చక్కబెట్టేస్తాడు ... యెల్లవే ! అటకమీదా ఆ వినబ్బొత్తైన కాలా... ఆ గాదికింద పిడకలగూట్లోనూ యెతికించు ! వెనకేపు తలుపులేయించి ఆ యెదవల్నిద్దరినీ యీ మాపు యిక్కడే పడుకోమను !"

అమ్మగారు పోసిన గంజి తాగుతున్న చంద్రిగాడూ ఎడ్లకి గడ్డి పడేస్తున్న అప్పి

గాడూ లోపలే వున్నారు.

ఆవిడ తన లావుపాటి ఒళ్ళు కదిలించు కుంటూ పెరట్లోకెళ్ళింది. పని పూర్తి చేసి చీకట్లో ముడిచిపెట్టుక్కూర్చున్నాడు అప్పిగాడు.

"అప్పిగా...!"

"ఏవండమ్మాయిగారోఁ!"

"దొంగాడొత్తన్నాడంట్రా! యెట్లో సుట్టు ఆ మిద్దెక్కి సూడు!"

"దొంగోడాండీ ... ! ఎందుకొత్తన్నా డండీ!"

"ఆడేకాదు! సువ్వూ సూడే యెదవా!" గుమ్మందగ్గర్నుంచే అరిచాడు వెంకటేశ్వర్లు.

చంద్రిగాడూ, అప్పిగాడూ విసుక్కుంటూ అంతా గాలించి యెవరూ లేరని నిర్ధారించారు. పెరటి తలుపులు దగ్గిరుండి వేయించి ఒకణ్ణి వెనక వరండాలోనూ ఒకణ్ణి ముందు చావిట్లోనూ కావలాగా పడుకోమన్జెప్పి... కర్ర తీసుకుని బయల్దేరాడు వెంకటేశ్వర్లు. దుప్పటి తలమీదకి లాక్కుని, అంచులు చెవులు వెనక్కుతోసి మరోసారి చుట్టలున్నాయో లేవో చూసుకుని బయటకు కదిలాడు.

"ఏంటండమ్మాయిగోరో! కాపుగారేంటం టన్నారండీ?" యిద్దరూ ఆవిడ దగ్గరకు చేరేరు.

"పోలీసోడే గావాల...వచ్చాడు! కాపుతో యేటన్నాడో యేటో! ఒకటే కంగారయి పోయాడు! మీకూ తెల్దేట్రా!"

"సొప్పాలొత్తాదేంటినాన్నా! దొంగోడు"

"నక్కలోళ్ళు యియ్యేపొత్తన్నారేమోరా!"

"జోరే! అప్పిగా! నువ్వెళ్ళి, అసలా దొంగాడేటో రాటపేటో అన్నీ యివరంగా కనుక్కురారా!"

"కాపుగోరు సూత్తే ఏటంటారో ఏటో నండమ్మాయిగోరూ!"

వాళ్లలా కిందామీదా అవుతుండగా ఆఖరిపాకం దింపించి చేలోంచి దిగడ్డాడు పెద్దాడు బాబ్జి!

"వణ్ణపెట్టు! వణ్ణపెట్టు..." రాంగానే తల్లికి పురమాంచాడు. "ఏరాఁ! బాబిజ్జీ: దొంగాడంట...! నీకేటయినా తెలుసునంట్రా...!"

"ఎవరో సెప్పారు! పాలేపారం సేత్తాడు సత్తియ్య... ఆడు తీసుకొత్తన్నాడంట...!"

"యియ్యేంబుద్దులొరేఁ! ఆడేటి... దొంగాణ్ణేటే... తీసుకు రాడవేటే! పెళ్ళాం బిడ్డల్తో వుండాలని లేదా యేటాడికి!... ఇంతకీ ఆడు వూళ్ళోకొచ్చినాడంట్రా!"

"సంపతన్నావుగందే! వణ్ణపెడితే ఆయెవ్వారవేటో కనుక్కొత్తాను. అన్నీ సెపుతా నొచ్చాక! తెగు!... తెగు...!!"

"బాబిజ్జీగోరోఁ! మావూఁ రావద్దాండీ"

"అందరూ యెల్లిపోండి... ఆడొచ్చి నా పీక నులిపేసి అన్నీ వూడుసుకుపోయాక... సూడ్డానికి రండి!" అరుస్తూ కొడుక్కి అన్నం పెట్టడానికి లోపలికెళ్ళింది.

"మీ రిల్లు కదిల్తే డొక్కచ్చీరి డోలో యించేత్తాను! ఆఁ! నంజికొడకల్లారా!"

బళ్ళోకి సంపితే ఎగ్గొట్టి పశువులెనకాలే తిరిగే కొడుక్కి చదువు అంటే అవకాశం లేదని... 'పండిత పుత్రః శుంఠః' అంటూ చదువు చెప్పించలేదు వెంకటేశ్వర్లు.

షావుకారు లింగయ్యసెట్టి యింట్లో కూడా దొంగాడి రాకగూర్చి తెలిసిపోయింది. ఆవేళ అనుక్రమం చూసుకుంటున్న సెట్టి మాణిక్యాలు చెప్పింది విని నిశ్చేష్టుడయి పోయాడు. 'నిజవేనా మాణిక్యం!' అంటూ ఒకటికి రెండు మార్లడిగాడు. డబ్బుల పెట్టితోసహా యింట్లోకి పరుగెట్టాడు. చీపురు కట్టల్తోసహా సమస్తం గదుల్లోకి తెచ్చిపెట్టుకునే ప్రయత్నంలో మునిగి పోయాడు.

కర్ణం రాంభద్రమూర్తి కచ్చల్లో కందులేపించినట్టు అల్లకల్లోలమయి పోయాడు.

"సత్తియ్య కావు మంచాడే గద మరిడయ్యా! అర్ధాంతరంగా యీ పోయే కాలం బుద్ధులు దాపురించే యేంటి! దొంగాడితో సావాసమా!!"

వీధరుగుమీంచే పెళ్ళానికి తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ వినిపించేసాక అన్నాడు.

ఆవిడ ఏదో పన్లో ఉంది! సరిగ్గా వినిపించుకోలేదు.

"ఏవిటండీ అంటున్నారూ ...!"

"ఓసి నీ మొహం ముండా! దరిద్రవు గొట్టు ముండా! కంచాలూ గిన్నెలూ బయట తగలెయ్యకు! పొద్దుటే రాజాలమొమ్మచ్చేక వేద్దువుగాని...! అన్నిగదులకీ 'తాళా'లు తగ లెయ్! వెంకడు... లోపల అఘోరిస్తున్నాళ్ళా వుంది... యీవేళ్టికి కాపలా పడుకోమను"

"మీ కంగారు మండినట్టే వుంది! ఏవి టండీ...! అసల్సంగతి!"

"అమ్మా! తల్లీ! వెళి చెప్పినవన్నీ చేసుకురా! విన్నవిస్తాను"

వార్త చేరేసిన మరిడయ్యఅందుకున్నాడు.

"ఏంలేదమ్మాయ్‌గారూ'... సత్తియ్య"

"సరిసరి! దానికే చెపుతున్నావూ ...! రాత్రంతా నిద్దరోనీదు! ప్రాణాలోడేస్తుంది చెప్పేలా నే జెపుతాలేగానీ...! నువ్వు లోపలికెళ్లవే...!"

రాంభద్రమూర్తికి పిల్లల్లేరు! పెళ్ళాం మాంచి భారీగా నిండుగా ఉంటుంది! తెలివి తేటల్తో ఊర్నంతటినీ ఏలుకుంటున్నాడు! పాతికెకరాలదాకా భూముంది! పెళ్ళాం వీధిలోకి వస్తే తేళ్ళూ జెర్రులూ పాకినటు ంటుంది. ఆవిడది పదిమందులేగాని



గడువుకోలేని తత్త్వం! మొగుడు లేనప్పుడు ఆవిడ వీధి అరుగుమీద పందిమందినీ చేర్చి ఆ వూరి రాజకీయాల నుంచి రంకుతనాల దాకా సమస్తమూ చర్చిస్తుంది.

## దొంగకథ

"ఆ యెంకణ్ణిలా వచ్చి తగలడమను!" మరిడయ్య అనుకున్నాడు. 'పెళ్ళాం మాంచిజబరు...!' యీసాన పిట్టమడిసి ...

వెంకడొస్తూనే కర్ణం చెప్పింది విన కుండానే అందుకున్నాడు.

"బావుందండి! నా పెళ్ళాం బిడ్డల

మాటే టండీ? అదీ ఒక్కతీ తొంగో వాలండి... !దానికి మరీ బయ్యం..."

"మీ దగ్గరేముంటాయి...? చింకి గుడ్డలూ... చిల్లుచేటలూనూ! వెధవ పీనుగభయం... నువ్వూనూ...!"

"అయ్యి పొలవేటండీ: ఒప్పుడు వూరికినే యియ్యడండీ...!"

"కర్మంగోరో! వీూలోగిట్లో యేటుంటా యండీ...! మీపాలికాపులిళ్ళలో...యెప్పుడూ సూళ్ళేదు గావాఁలండి!... యెన్నోటుం టాయో! పండగరోజులు! మొహాపుసెరు కమ్మితీ... సాలు!మొహాపుడు... పసలట్టు కెళ్తే...సాలు...!"

"ఊరుకోండి మరిడయ్యగోరూ! మీరు మరీ సెప్తారు..."

"నేకపోతే యేట్రా...! ఆయనగారేదో గాబరా కొద్దీ సెప్పారే అనుకో! కడుపూ కాల్లూ అట్టుకొని మరో యేరుపాటేదో సూసుకోండనాల గానీ... అయ్యేం సమా ధాన్రాలా...! బామర్దకాడ పన్సేసి... కొవ్వు బలిసి పోయిందిరా నీకు!"

ఆవూరి పెద్దలికీ చిన్నలకీ అందరికీ తెలిసి పోయింది దొంగాడి వార్త...! చెరువు గట్టు మీద అందరూ పోగయారు. పెద్దాపురం నుంచి వార్త మోసుకొచ్చిన 'యేడ్రు' వచ్చినాళ్ళందరికీ జరిగినది వివరిస్తున్నాడు.

ఎంగ్రడయ్యకు వ్యవహారనామం 'యేడ్రు'.

"సాలా బత్తులావుడు బస్సుగుద్దీసి సచ్చిపోయాడుగాదండీ ...ఆడి కేసుయియ్యేల వాయిదా...! ఆడిదుంపతెగ...! ఆప్లీడరు గోడు పెతిమాటూ వోయిదా లడుగుతానే వుంటాడు గానీ తేల్చీడు... యిసుపెక్కి పోయిందండి! సచ్చిన సాలా బత్తులావుడూ బానేవున్నాడు... సంపేసిన సాఁవర్లకోట సావుకోరూ బానే వున్నాడు. మద్దిన సాచ్చి కానికొచ్చుకున్ననే న్సత్తన్నానండి తిరగలేక! కోరుటుకు కెళ్లినోళ్ళా... సంత కెళ్లి నోళ్ళా... తాలూకాపీసుల కెళ్లినోళ్ళు ... ఓఁ! ఓటే జనవండి! పండగ్రోజులు!

సెప్పే అక్కర్లేదు! బస్టాండులో జనాన్ని చూసి యియ్యేఁకూడా నడకే లాగుందను కున్నానండి! పొద్దు తిరిగే సరికి యిసకేస్తే రాలన్జనం! పెతి వోయిదానాడూ సత్తియ్య కనుపిత్తాడండీ! నేనో ఆడో— సైకిల్దొక్కి యింటికొచ్చే వాళ్ళవండి...!—

ఆడికోసరవే సూత్తా నించున్నానండి! టయానికి ఆవడ్డాడండి! యెయ్యి దేవుళ్ళకీ మొక్కుకుని పరుగెత్తానండి! తస్సాదియ్య. ఆడన్నాడండి...

"బస్సెక్కెయ్ యేడ్రూ"

"వూరుకోవోఁ! యేలాకోలం యెకా సెక్కం" అంటూ సైకిర్చిలబెట్టేసా నండి!

"దొంగోడున్నాడు! ఆణ్ణి దీసుకురావాల" అన్నాడండి!

ఈడేదో పేలేటేత్తన్నాడ్రా అనుకున్నా నండి.

"యెల్లవోఁ! నేనే దొక్కుతానుగానీ... దిగు దిగు!" అన్నానండి.

యిన్నేనండి!

## మునగ ఆకుకూర

కావలసిన వసువులు :- మునగ ఆకు- పావుకిలో, కందిపప్పు- 50 గ్రాములు, పచ్చికొబ్బరి- ఒక చిప్ప, జీలకర్ర—ఒకస్పూన్, ఆవాలు - ఒక స్పూన్, మినపపప్పు—ఒకస్పూన్.

చేసే పద్ధతి:- కందిపప్పు మరీ మెత్తగా కాకుండ మూడు వంతులు ఉడికించాలి. మునగఆకు పండు ఆకులు, పుల్లలు లేకుండ ఏరి కొద్దిగా నీళ్ళుపోసి ఉడికించాలి. ఉడికిన తరువాత నీళ్ళు ఒంపి పళ్లెంలో ఉంచాలి. బాణలి స్టౌవ్‌మీద పెట్టి కొద్దిగా మూనెవేసి ఆవాలు, జీలకర్ర వేసి వేయించి దానిలో ఉడికిన ఆకును వేసి కలియబెట్టాలి. ఈపప్పు, కొబ్బరికోరు వేసి బాగా కలిపి, తగినంత ఉప్పు, కారంకూడ వేసి కలిపి దించాలి.

— సి. రాజ్యలక్ష్మి

"ఆ లంజికొడుకుని తీసుకురావాలన్నా" డండి.

ఆడన్నీ కతల్చెపుతాడండి! అలాగే అను కున్నాగనండీ— నిజవేనండి! ఆడు దొంగాణ్ణి తీసుకొత్తన్నాడండి!"

వచ్చినాళ్ళందరితోనూ చెపుతూనే వున్నాడు ఏడ్రు.

"ఆడేం చెప్పాడ్రా?" వెంకటేశ్వర్లడి గాడు.

"పోలీస్టేషన్‌కి అప్పజెప్పా గాని... యిక్కడి కెందుకని అడగలేదా యేడ్రా" కర్మం!

"టయానికి తట్టలేదండి! బస్సూ— వొచ్చేసిందండి! అవుతే... ఆడు సెప్పిం దేటంటే... నండీ! పొలన్నీ అమ్మేసుకున్నా ట్టంటండి! 'రతన భవనం' హొటేలుకు పాలోత్తాడు గాదండీ... 'పెసరట్టుప్మా' ఆడికి మాంచి యిట్టవండి! అత్తినీసాక షావుకోరు లెక్కగట్టి డబ్బులిచ్చేసేట్టండి! యెవుడో కనిపెడుతానే వుండాల! యీ వెనకే బయల్దేరాడు! యీాడూ తక్కువ తిన్నోడు గాదండి! మంచి లెక్కల్తో మనిషండి...!

—పక్కపక్కనే సేరాట్టండి!—"

"ఒక్కడే అన్నావ్..." బుల్లితాతయ్య కొడుకు తర్డ్‌ఫారందాకా చదివాడు! అతని పేరు 'చిన్నిరాసావిఁ'. అతనికి 'విట్టడం' 'తప్పులు పట్టడం' సరదా!

గుంపులో అన్నిరకాలనాళ్ళూ ఉన్నారు.

సుబ్బారావు యస్సెస్సెల్సీ ఆరుసార్లు ఫెయిలై ఉద్యోగ ప్రయత్నంలో పేసవ టానికి యత్నిస్తున్నాడు. యిరవైమూడేళ్ళు వయసుండటంవల్ల ఆడదాని అవసరం ఉందతనికి. కనిపించని దేవుడు కనిపిస్తే జనాన్ని గుంపులు గావించు... జనం గుంపు లను పెంచు... గుంపులు గుంపులుగానే వుంచు' అనికోరాలని ఉంది. సంతలూ తీర్థాలూ అంటే అతనికి గొప్ప యిష్టం. అతని చేతులు గుంపుల్లో జొరబడి నూలూ సిల్కూ భేదం లేకుండా రవికల్ని పరామర్శి స్తుంటాయి.

"దొంగాడి ధర్మమా" అని అతని కోరిక తీరింది.

అన్నగారు చచ్చాక ఆస్తి 'పడేసు'కుందా మని బంగారయ్యకొపు వదినకి — లొంగదీసు కుందావనేట — మందెట్టాడుట. అందులో ఏంతేడా పొడాలున్నాయో ... బెడిసికొట్టి పిచ్చెక్కిందంటారు జనం.

దొంగాడి అడావుడితో ఆవిడ తప్పించు కొని పైకొచ్చేసింది. సుబ్బారావు చేయి జనాన్ని చీల్చుకుని ఆవిడని తాకింది.

"ఓర్నాయనో!!" అరిచేసింది.

"ఎవరెహే! ఎదవరుపులు! యిన్ని కుండాను..."

"దొంగ నచ్చినోడు! గిల్లీసాడు"

"ఎక్కడా?"

"ఆడు సెప్పేదిసీ వోళ్ళుండండి! లేనోళ్ళు పొండి!"

"యెదవల్లారి... యెదవల్లారని."

బంగారయ్య వీటో ఉన్నాడు. వదిన గొంతు గుర్తుపట్టలేదు.

వెన్నెట్లో 'సీడా వెన్నెలా' అట ఆడు కుంటున్న పిల్లలుతప్ప పెద్దాళ్ళు 'ఏడ్రు' చెప్పేది వినడంకోసం చెవులు రిక్కించారు.

ఏమోనండి! ఆడు సెప్పడం... వోసుట్టు యిద్దరన్నా డండి వోసుట్టు ఒక్కడన్నాడండి! అప్పుతే వోడు పారి పోయుంటాడండి!"

"నర్లేవోఁ! జరిగింది సెప్పు..."

ఆవళంగా ఆడు కానుకోలేదండి! జేబు లోంచి లెక్కతీస్తాన్నాడు! నూస్తాన్నాడు! తీస్తాన్నాడు! నూస్తాన్నాడు! యియ్యన్నీ — దొంగల కెయ్యికల్లండి — ఆడు అంచనా యేసేసాడండి.

— వోడు దగ్గరంటా వచ్చి ఖద్దరు కొట్టెక్కడా అన్నాడంటండి! ఆపాటిదూరాన కాపాడతానే ఉందంటండి ఖద్దరు కొట్టు! —ఒక్కసెణం పట్టలేదంటే నమ్మండి — యిలా సెయ్యట్టడం అలా లెక్కలాగెయ్యటం

# దొంగకధ

అయిపోయిందంటండి! యీాడ్రెరిమా లో కంలా 'కనుపించా' డంటండాళ్ళకి! సెయ్యి.. యెత్తి అదిగదిగో ఆవచ్చుమేడే ఖద్దరు కొట్టుని సూపిత్తానే ఉన్నాడంట! రెండో వాడు పనిగానిచ్చేసాడు! సిన్న అనుమానమైఁ జేబు తడువుకున్నాట్టండి మనోడు! ఆడదు రుట్టం బాగుంది: దొంగోడికి సెడ్డరోజయి పోయింది: మలుపు తిరక్కుండానే పట్టే సాడంటండి!"

జనం ఊపిరి బిగబట్టి వింటున్నారు

"తర్వాత... ?"

"ఆడికెపుడో సుట్టపున్నాట్టండి! ఆడింట్లో దొంగాణ్ణి కట్టిపడేసి— పని సూసుకున్నాక— తీసుకొద్దారనుకున్నాట్టండి 'యిక్కడి' కెందుకురా సత్తియ్యా అనడుగు దావనుకుంటానే ఉన్నానండి ... బస్సొచ్చేసిం దండి! అద్దాటిపోతే నాపనప్పుద్సని పరిగెత్తా నండి!"

"యిదేటి బావ!!" వెంకటేశ్వరు కర్ణాన్ని బావ వరసతో పిలుస్తాడు.

"ఏడో తాగుబోతు ముండాకొడుకు! వాడికి తోచి చావదు. ఒకడు చెపితే విని చావడు!"

"మా నన్నాసెదవకి సినీమాలు గావ ల్సొచ్చాయి. సినీమాలు! ముసలి ముండా కొడుకుని కొట్టుమీద నేనేడ్డం. ఊళ్ళట్టు కుని వాడు పోవడం యిదంతా నా పీకలమీద కొచ్చింది."

"ఊరుకో లింగయ్యా! యిది పూరా! అడివా! మే మందరం లేవా. అయినా వాణ్ణి కట్టేసేగా తెస్తూంట!"

పురోహితుడు శంకరశాస్త్రికి వయసు మళ్ళింది! బ్రహ్మ చెముడు! చూపు ఆనదు! యేడ్రు చెప్పింది అక్కడో ముక్కా ఇక్కడో ముక్కా చెవుల బడిందిగాని పూరాగా అర్థం కాలేదు! ఎవర్నడిగినా వివరంగా చెప్పరు!

"పిదపకాలం వెధవలు...! వాడేడిసే దేవిటో... చెప్పగూడదా... అంట!"

"యింతకీ... దొంగాడెలా ఉంటాడో... అమ్మీ!"

"నల్లగా ... పొడుగ్గా ఉంటాడు! ఆముదంకూడా రాసుకుంటాడు దేనికో తెలుసా వదినా! జారిపోడానికి."

"మన్లాగే ఉంటాడేవిటీ!"

"కాదండీ బామ్మగారూ! వాడికేమో... మూడేసి చెవులూ, మూడేసి కళ్ళూ... రెండు కోరలూ"

'వూరుకోవే ముదనష్టప్పీనుగా! ఆవిడేదో తెలియకంటె వెధవ్వేషాలూ నువ్వూ తయారు"

చెరువుగట్టువారనే ఉన్న పురోహితుడింటి పెరటి గుమ్మంలో సంభాషణ సాగిపోతోంది.

'చిన్నిరాసావి'కి వో బుల్లి సందేహం వచ్చింది.

"దొంగాణ్ణేం జెయ్యాలన్నా!"

వెంకటేశ్వర్లు అతనికి అన్నవరస.

"మన ఏరియాలో దొంగతనం చెయ్యలేదుగదా! మనమేంజేస్తాం?" కర్ణం.

"పులుసులో కెవీక లేకుండా చితగ్గొట్టెయడవే!"

"మంచిమాటన్నాడు మునసబు! పాము మీద జాలిచూపితె కుట్టికుట్టి 'సం'పుతుంది! అణ్ణి... అణ్ణి తీసుకొచ్చినందుకి సత్తియ్యగాణ్ణి... వో చూపు చూడాల్సొదే మంచి మాటలికి రోజుల్చెల్లిపోయాయి" వెంకటేశ్వర్లు.

"చచ్చూరుకుంటాడు! మనందరి పీకలకీ చుట్టుకుంటుంది! అందులోనూ వాడే మాలపీనుగో అయుంటే... ప్రైంమినిస్టరుదాకా పోతుంది గొడవ!" కర్ణం.

"గొడవలెట్టించడవూ నీకు దెల్సు! యిదదీయడవూ నీకు దెల్సు భయంలేదులేవోయ్!"

"ఏవిటి! కర్ణంగోరినే అంత లెసి మాటలంటున్నావ్.!"

"కర్ణవయితే ఎక్కువూడబొడిచాడా!"

"ఆడికి పట్టానంబరేదో యివ్వలేదంట! తాలూకాఫీసుకెళ్తేగాని పనవలేదంట... అదీ దొబ్బుతెగులు!"

"ఏంటిబావా! యీ పని."

"నన్నేం జేయమంటా వెంకటేశ్వర్లూ! యిస్తే ఆడేదుస్తాడు! యివ్వాపోతే యీయనగారు."

"యెయ్యి సెప్పు... నూరు సెప్పు... కర్ణంగోరూ! మీ నాయనగారి అయాంలో ఒక్కడు మాటన్నేదాయన్ని...!"

"ఆ రోజులూ... ఆ మరియాదలూ... అయ్యన్నీ... యేరు!"

"ఆ గొడవ లెందుగ్గానీ... అడేవుంట్లో??"

"సత్తియ్యగోడు యింత బద్దరంగా పట్టుకొత్తన్నాడంటే...!"

"ఏటంటావ్ రాఘవులూ...??"

"మరేటి నేదు బాబయ్యా...! యీడాడికేవయినా సుట్టవేమో!"

మునసబు మొహం వెలవెల బోయింది. అతనూ సత్తియ్యా ఒకటే 'వర్ణం'!

"ఒకటే వర్ణవని... దొంగాణ్ణెవడు నెత్తికెక్కించుకుంటాడో...!"

"అందుకేనేమో...! నాలుగు తన్ని పంపించొచ్చని తీసుకొత్తన్నాడు."

అదేదో ఆ బజార్లోనే కానియ్యొచ్చుగా!"

"యీడి యీరత్వం వూరూ వాడా... సెప్పుకోవద్దంటండి!"

"గొప్ప గౌరిగించుకున్నట్టే ఉంది. వేలద్దిపి నెత్తినేసుకోడం..."

చిన్నిరాసావి విట్నాడు.

"కరెట్టండి! ఆడి గుండు గొరిగిసి..."

"నున్నగా..."

"కాదెహే! మెట్లు మెట్లుగా..."

"సున్నబొట్లు లెట్టేడాంకి బావో దీరాసావీ!"

"నవ్వుల్లాలుగాని...నలుగురు కుర్రాళ్ళు సైకిళ్లేసుకెని యెదురెళ్లగూడదంట్రా... ఆడేం తిప్పలడుతున్నాడో యేటో...!"

"వచ్చేవోయ్! దొంగాణ్ణి ఈవూరోళ్ళు ఎప్పుడూ సూణ్ణట్టే లాక్కొత్తన్నాడు... యెదవ తెలివి... యెదవతెలివని...!"

"టయివెంతయింది?"

"యీపాటేల కొచ్చియాలే..."

"ఒరి సచ్చినాడోయ్...! గోతులో వోడోయ్...!"

సుబ్బారావు చెయ్యి పిచ్చిది పట్టేసుకుంది అతని మొహం వెలవెల పోతోంది! గిజాయించుకుంటున్నాడు.

"పిచ్చిది! పిచ్చిది!"

"బంగారయ్యోదినగోరు..."

"చెయ్యట్టుకు వొదలటం లేదు..."

"విన్నెందుకట్టుకొంది...?"

"బంగారయ్యా లేడా! యిదెలాగొచ్చింది?"

నోటీస్ – ఈ గోడమీదు ఎవ్వరును నోటీసులు గాని, వ్యాపార ప్రకటనలుగాని, సినిమా-వాల్ పోస్టర్స్‌గాని, రాజకీయ ప్రకటనలుగాని, కార్మిక సమ్మె

ప్రకటనలుగాని, ఏ ఇతర ప్రకటనలుగాని వ్రాయుట, లేక అంటించుటగాని చేయరాదు. దీనిని అతిక్రమించినవాళ్లు శిక్షార్హులుగా తెలియచేస్తున్నాం.

ప్రసాద్

# యువతరం

"నేనింతవరకు హిందీ సినిమాలు చూడ లేదు" అంటున్న ఈ ఫొటోలోని అబ్బాయిపేరు మల్లెల శివరామకృష్ణశర్మ. విజయవాడ కె.బి.ఎన్. కళాశాలలో బి.కాం. చదువుతున్నాడు. నేను లైబ్రరీలకు వెళ్తాను ఎక్కువగా జనరల్‌నాలెడ్జి పుస్తకాలు చదువుతాను అని చెప్పాడు. జాతీయ సేవాపథకం (ఎన్. ఎస్. ఎస్.)లో పని చేయటం, వ్యాసాలు రాయటం, ఫొటోలు తీయటం హాబీలు. మంత్రులనుకాని సినిమా నటులనుకానీ చూడాలన్న సరదా



మాత్రం లేదన్నాడు. శలవుల్లో ఉద్యోగం చేసి ఎంతోకొంత సంపాదించుకుంటాను అని చెప్పాడు. ఇతడు కాలేజీలో మెరిట్ స్కాలర్‌షిప్ కూడా పుచ్చుకుంటున్నాడు. ఫొటోగ్రఫీ త్రైమాసపత్రికకు గౌరవ విలేఖరిగా వుంటున్నాడట! ఈ యువకుడికి అయిదారుగురు విద్యార్థులకి ఉచితంగా విద్యాభోదన చేయడం అలవాటు. కట్నం తీసుకోకుండా వివాహం చేసుకుంటాను అంటున్న ఈతడి ఆశయం బ్యాంకులో ఉద్యోగం సంపాదించటం. — సు.

## దొంగకథ

"ఏట్రా! బంగారయ్యంటన్నారు."

అతని గొంతు వింటూనే సుబ్బారావు చెయ్యొదిలి పరుగెత్తింది.

"హోసీ! నువ్వంటే" బంగారయ్య వెంటబడ్డాడు.

"హోలమ్మో! సంపేత్తన్నాడు" కేకలు దూరమయ్యాయి! ఏం జరుగుతుందో నను కున్న సుబ్బారావు మరోవైపు సర్దుకున్నాడు.

యీ రాత్రికి దొంగాణ్ణే చెయ్యాలి? ప్రతివాడికీ ప్రశ్న.

వదిలేస్తే ఎవరిల్లో సాఫవటం ఖాయం! ప్రతివాడికీ భయం.

రకరకాల ఆలోచన్లు.

"కర్ణం మునసబులుండగా మనకేటో!"

"ఆళ్ళేవయినా పోలీసోళ్ళా!"

"పోలీసులోళ్ళు! ఆళ్ళూ ఉయాళ్ళూ ఒకటే ... పంచుకుంటారంట."

"సోరా కుయ్యా! అందర్లో నూ మంచోళ్ళూ, సెడ్డోళ్ళూ ఉంటారు. ఆ మద్దిన యేలేటిపాడు జమీందారు గారింట్లో దొంగలడితే సిటికెలమీద పట్టేసారు! ఆళ్ళు సెడ్డోళ్ళకి సెడ్డోళ్ళు! మంచాళ్ళకి మంచాళ్ళు!"

"అదేంగాదు లెగవోయ్! ఉన్నోళ్లకి ఆళ్ళు మంచోళ్ళు."

"ఎందుకా కడుపు మంటంట? లేనోడి కాడేటి సేస్తారు?"

"సర్లేగానీ మావోడోడుండాల! పారిపోయేడేళ్లవుద్ది! దొంగల్లో గల్సాడేవోయ్ ఆరాదియ్యాల!"

జనం ఆలోచిస్తున్నారు...నిశ్చయిస్తున్నారు! సందేహిస్తున్నారు...!

"యీపాటి కొచ్చేయాల! బాబ్బాబు ఎవరయినా యెల్లండి!" సత్తియ్య పెళ్ళాం గోల!

"రాగానే రోకళ్లతో పొడాల లంజికొడుకుని" ఆడాళ్ళు.

"దెయ్యాలచింతగ్గట్టియ్యాల మాపంతా అక్కడుంటే" భయస్తుడు.

"దున్నల్లాగుంటారు! కష్టపడరాదూ!" సెట్టి.

"దొంగతనంజేస్తే ఉరి దీసెయ్యాలని పాస్‌జేస్తే బాగుణ్ణు" వెంకటేశ్వర్లు.

"అదోటి తరవాయి హత్యల్జేస్తేనే! వదిలెయ్ మంటున్నారు." దూరంనుంచి పెద్ద గొంతుతో ఎవరో పాడుకుంటూ వస్తున్నారు. జనమంతా ఒక్కుమ్మడిగా అటుచూసారు.

"సత్తియ్యగాడిగొంతే!"

"సత్తియ్యే!" "సత్తియ్యే"

"సత్తియ్యేనల్లా"

"పాటలుపాడతా వత్తన్నాడేటంటావ్?"

"మడిసి మడిసికి బరువు! మాటలేటీ ...తొక్కడం!"

"అందుకేగావాలంజీ నెమ్మదిగా వత్తన్నాడు."

జనం పరుగెత్తారు రోడ్డమ్మట.

మలుపు తిరిగింది సైకిలు. అస్పష్టంగా కనిపిస్తోంది.

"యెనకాలెవడో ఉన్నట్టే ఉన్నాడల్లా!"

"దొంగ వచ్చినోడెంతలావో!!"

"నాక్కాపట్టంలేదు."

"సరిగ్గా సూడే! అదిగో తెల్లపంచీ అడానూ."

"రానీయే సూద్దావుగాని."

"మరిడియ్యా! అంత జోరుగా వస్తన్నాడేటంటావ్!"

"దొంగాణ్ణి దించేస్తే మనోళ్ళు లాక్కొస్తున్నారేమో!!" రివ్వుమంటూ సైకిలు వచ్చింది! వెనక సీటుమీద ఎవరూ లేరు. పూటుగా తాగేసున్నాడేమో... సైకిలు ఆపేసరికి బ్రహ్మప్రళయమయింది.

"దొంగాడేడిరా?" "దొంగాడేడి?" ఏడి... ఏడి?" పదిమందీ ప్రశ్నించేసరికి సత్తియ్య గొంతు పెంచాడు.

"పచ్చగడ్డి కోసేటి పడుచుపిల్లా! నీ సైటకొంగు."

"వీడి మొహం మండా! తాగేసున్నాడ్రా పీనుగ!"

"దొంగాడేడిరా?"

"నల్లావాడే... అమ్మమ్మా! ముంచు... తా...డే!"

"వో బిందెడు నీళ్ళొయ్యండల్లా! ఆడే సెపుతాడు."

"బావా! పోదాం పద! యీడు దొంగాణ్ణి తీసుకురాలేదు! అదే సంతోసం!"

"ఏమో! ఊరుమొగదలొగ్గేసాడేమో!"

"కనుక్కోండి! కనుక్కోండి."

వో అరగంటసేపు అలా పాడుతూనే సణుగుతూనే సత్తియ్య తేల్చేసాడు!

ఏర్దుగాడు ఎంటపడితే... ఆడిగ్గాడా తాగించాలని... వదిలించుకుందుకు... 'కత సెప్పాట్ట'... నాటకవాడాట్ట...!'

మొదటి రుచి, అది ఎన్నటికీ
మరవలేని రుచి










PRS/2799/TEL

—చిన్న సీరియల్

# పి.ఏ. హిమబిందు

జొన్నలగడ్డ లలితాదేవి

ఆఫీసులోనే పనిచేస్తున్న మరో అందాల బొమ్మ మాధవి. హిమబిందు రాక పూర్వం ఆమె సౌందర్యం ఆఫీసులో అలజడి రేపింది. ఆమెకోసం చాలామంది తాపత్రయ పడేవారు. కాని ఏదో సామెత చెప్పినట్టు హిమబిందు ప్రవేశంతో అత్యద్భుత సౌందర్య రాశి అయిన ఆమె కటాక్షవీక్షణాలకోసం తాపత్రయ పడసాగారు. పైగా హిమబిందు జనరల్ మేనేజరుగారి పి. ఏ. ఆయనెంతో ఆమెకూడా అంతేనన్న భయభక్తులుకూడా ఆ ఆఫీసులో మెండుగా వుండటంతో మాధవి అడుగున పడిపోయింది.

అయితే అందుకు మాధవి ఏమీ బాధ పడలేదు సరిగదా చాలా సంతోషించింది కూడా. ఆమెకీ మగవారంతా ఏదో పలకరించాలని, రాసుకు పూసుకు తిరగాలని వాంఛించడం బొత్తిగా నచ్చని విషయం. అయినా యిక్కడి పరిస్థితులకి సౌమ్యంగానే మసలుకునేదిగాని ఎవర్నీ తూలనాడి విసుక్కొని ఏదో గీర చూపించేదికాదు.

అయితే ఆమె హృదయంలో ఒక ప్రత్యేకమైన స్థానం, అభిమానం శ్రీపతి అంటే వున్నాయి. అతన్ని మనసులో మూగగా ఆరాధించే ఆమెతో శ్రీపతి చాలా సార్లే మాట్లాడాడు. అతను మాట్లాడినప్పుడల్లా ఆమె కళ్ళల్లో కోటికాంతిపుంజాలు విరిసి పులకరింతలు కలిగి సామాన్యంగా మాట్లాడటానికే సిగ్గుపడుతూండటం శ్రీపతి గమనించకపోలేదు. మాధవి అందమైన, తెలివైన అమ్మాయి అనే అతని మనస్సులో అనుకున్నాడుగాని ఈ విధమైన మమకారం అతనిపైన వుందని ఆతడు గుర్తించలేదు.

(గత సంచిక తరువాయి)

అయితే అతన్ని బాగా ఆకర్షించింది హిమబిందు. తొలిచూపులోనే ఆమె అతడిని ముగ్ధుణ్ణి చేసింది. శ్రీపతి హిమబిందును కారులో తీసుకువెళ్ళడం రెండు మూడు సార్లు మాధవి గమనించింది.

మా మూలుగా డిపార్టుమెంటులో టైపిస్టు అయిన మాధవి సామాన్యంగానే కనిపించడంతో ఆమె విషయం పట్టించుకోవడం మానేశారంతా.

ఆ రోజు హిమబిందు భువనమోహినిలా అలంకరించుకుని వచ్చింది ఆఫీసుకి. ఆ తళుకులీనే జరీ ఎంబ్రాయిడరీ చీరలో తటిల్లతలా మెరుస్తూ స్ప్రింగ్ డోర్ తెరచుకొని వచ్చిన హిమబిందును చూసి పిచ్చివాడై పోయాడు శ్రీపతి.

"ఏమిటివాళ క్రొత్తగా కనిపిస్తున్నావు ? బర్త్‌డేనా ?" అనడిగాడు నవ్వుతూ.

"అవును".

"ఐ.సీ. కాస్త ముందుగా ఇన్‌ఫర్మేషన్ యిస్తే నీ సొమ్మేం పోయింది" ? కినుకగా అడిగాడు

"నాసొమ్మేమీ పోదు. పోతేపోయేదిమీ సొమ్మే" చిలిపిగా అంది హిమ.

"గడుసుదానివేలే పోయేసొమ్ము ఎలాగో పోతూనే వుంటుంది. ఇలాంటి యింపార్టెంట్ విషయాలు దాచిపెట్టి నాకు మనీ ఏదో సేవ్ చేయాలని, భావించకు" శ్రీపతి కంఠంలోని కోపాన్ని గుర్తించి సన్నగా నవ్వింది హిమబిందు.

"మీరుకూడా యిలా కోపాలు తెచ్చిపెట్టుకొని పిచ్చిక మీద బ్రహ్మాస్త్రాలు వేయకండి."

ఆ మాటతో కోపం పోయిన శ్రీపతి "మరయితే పార్టీ ఏదన్నా వుందా ?" అని ప్రశ్నించాడు.

"పార్టీలు చేసుకోడానికి నేనేమీ సినిమా స్టార్‌ని, మంత్రి సత్తమురాలినీ కాదు గదా. మీ ఒక్కరికి రాత్రికి సింపుల్‌గా డిన్నర్ ఇస్తున్నాను అంతే."

అ మాటతో మతాబాలా వెలిగిపోయింది శ్రీపతి ముఖం.

"అయితే ఆఫీసులో ఆఫీసు స్టాఫ్ కందరికీ పార్టీయివ్వండి" అంటూ పర్సులోంచి వంద రూపాయల నోటు అందించాడు శ్రీపతి.

"మీరు పేరుకీ తగినట్లు పర్సునిండా డబ్బుతో వస్తారనుకుంటాను. మళ్ళీ ఈ మనీ ఒక్కసారి నేను మీకు రిటర్న్ చేయలేను. "ఇన్‌స్టాల్‌మెంట్స్ మీద తప్ప."

"అలాగే వడ్డీ కూడా కలిపి" అంటూ అందించాడు.

"వడ్డీయా!" అంటూ నవ్వి "కుబేరుడు దగ్గర వెంకటేశ్వరస్వామి పద్మావతీదేవితో పరిణయంకోసం తీసుకున్న డబ్బుకి ఇంత వరకూ వడ్డీయే తీర్చటం కాలేదట పాపం అలాంటి జగద్రక్షకుడికే వడ్డీ తీరక అసలు అసలుగానే వుండిపోయి కలియుగాంతానికి తీర్చలేనిస్థితిలో పడిపోతే ఆఫ్టరాల్ ఆడపిల్లని నా వల్లేమవుతుంది. బాకీలు చెల్లించడం?" అంది చిలిపిగా.

"నేను వడ్డీ అడగలేదు. నువ్వే ఇస్తానన్నావు. పుచ్చుకొని మూఢాత్ముడెవరుంటారో చెప్పు నీలాంటి అందాల సుందరి దగ్గర."

"ఇది మరీ బాగుంది. అందాల సుందరి దగ్గర వడ్డీ పుచ్చుకుంటారా ఎవరైనా?"

"అందరి విషయమూ తీసివేయి. నేను మాత్రం తప్పకుండా పుచ్చుకుంటాను. అందమైన హస్తాల్లోంచి అందుకోవడం అనే లక్ అందరికీ వుండదు. అలాంటి ఛాన్స్ నాకు వచ్చినప్పుడు వదులుకోలేను."

ఆ మాటలకు కిలకిలా నవ్వింది హిమబిందు.

**జరిగినకథ 1** జనరల్ మేనేజర్ శ్రీపతి పి. ఏ. గా చేరిన హిమబిందు అందం ఆ ఆఫీసులో అలజడి రేపుతుంది. డబ్బు, హోదా, అధికారం అన్నీవున్న శ్రీపతి ఆమెని ఆకర్షిస్తాడు.

స్వీటు శావరీ కాఫీ అందరికీ దగ్గరుండి ఇప్పించింది హిమ ఎవరి మటుకు వారికే అదో గొప్ప థ్రిల్ అనిపించింది

మాధవి "మెనీ రిటర్న్స్" చెప్పింది నవ్వుతూ ఆరోజు ఆమెకూడా నూతన వస్త్రాలంకృతయై వచ్చింది కాని ఆమె సంగతి పట్టించుకున్న వారేరి? అంతా హిమ బిందు హిమంలో కూరుకుపోయినవారే! నిజానికి మాధవి పుట్టినరోజు కూడా ఆ రోజే. అయితే తన సౌందర్యాన్ని డామినేట్ చేసే హిమబిందు వచ్చాక తనకేమీ ప్రాధాన్యత లేదని ఆమెకీ తెలుసు కనుక ఎవరికీ చెప్పలేదు. సాయంత్రానికి ప్రజంటేషన్లు చాలానే అందాయి హిమబిందుకి. అన్నీ స్వీకరించింది హిమ. అన్నీ శ్రీపతి కారులో పెట్టింది బ్యాక్ సీటులో ఫ్రంట్ డోర్ తెరచి తన ప్రక్కనే కూర్చున్న హిమ బిందును చూసి గుండె లయ తప్పింది శ్రీపతికి.

తిన్నగా ఇంటికి వచ్చాక "మీరు ఈ మాగ్జైన్స్ చూస్తుండండి. నేను అర గంటలో వంటింటి పని ముగించుకుని వస్తాను" అంది హిమ

"నేనలా బయటికి వెళ్ళి వో గంటలో వస్తాను" అంటూ నవ్వుతూ కారు స్టార్టు చేశాడు శ్రీపతి.

బజారుకువెళ్ళి నూటయాభైలో ఒక చీర, పూలు, పళ్ళు, స్వీట్సు అన్నీ కొని శ్రీపతి వో గంటలో యింటికి వచ్చేసరికి హిమబిందు వంట పూర్తిచేసి రెడీగా వుంది.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేశాక అతని కోరికపై అతను తెచ్చిన చీర కట్టుకుని వచ్చింది హిమ. "సినిమాకి వెడదాం" అంటూ శ్రీపతి చెప్పాక అభ్యంతరం చెప్పలేదు హిమబిందుతో కలిసి సినిమా చూడటం అతనికి మంచి ఉత్సాహాన్నిచ్చింది. హిమబిందు క్షణక్షణమూ తనని అయస్కాంతంలా ఆకర్షిస్తుంటే నిలవరించుకోవడం చాలా కష్టమైంది శ్రీపతికి.

"హిమా! నిన్నొకటి అడగాలనుకుంటు న్నాను. దయచేసి సూటిగా జవాబిస్తావా?" సినిమానించి వస్తూనే అతడడిగినమాట అది.

"అడగండి."

"నీకిష్టమైతే మనం దంపతులం కావా లని నా ఆకాంక్ష." అంటూ ఆగి ఆమె కన్నులలోకి చూశాడు. ఆ మాటతో సిగ్గుల మొగ్గయింది హిమ. తన మనస్సులోని తీపి కలలకి రూపం ఏర్పడి సఫలీకృతమైనట్లే తోచింది.

"మీరు నన్నింత అదృష్టవంతురాలిని చేస్తానంటే కాదంటానా?" అంది అవనత శిరస్కయై.



ఆ మాట వింటూనే తటాలున మీదకి లాక్కుని బుగ్గలు రెండూ ముద్దులతో ముంచివేశాడు శ్రీపతి. ముద్దులు మూట గట్టే ఆమె ముఖ కమలాన్ని ఎన్నిసార్లు ముద్దాడినా అతనికి తనివి తీరలేదు. అతని కౌగిలిలో కరిగిపోయింది హిమబిందు.

"మనం ఇంక ఆట్టే రోజులు జాప్యం చేయొద్దు హిమా! చాలా త్వరగానే మనం భార్యాభర్తలం అయి ఆనందపు లోతులు చూద్దాం."

"శ్రీవారి ఆజ్ఞను ధిక్కరిస్తానా?"

శ్రీపతికిప్పుడు ప్రపంచమంతా నందనోద్యానవనంలా సుగంధ బంధారంగానూ, అందులో తామిద్దరే చెట్టాపట్టాలు వేసుకుంటూ విహరిస్తున్న ప్రేమమూర్తులుగానూ కన్పడసాగింది. తొలిసారిగా చంద్రమండలంపై కాలూనిన ఆర్మ్‌స్ట్రాంగ్ కూడా అంత ఆనందసాగరంలో మునిగి వుండడు.

హిమబిందుకూ అంతే! కన్నెగా తను కంటున్న మధుర స్వప్నాలకు, ఎంతకాలంగానో దిగిరావాలని ఆకాంక్షిస్తున్న జయంతుడు, వసంతుడు, కుబేరుడుకూడా కలిసి ఏకాకృతి ధరించి తనకోసం దివినుండి భువికి దిగివచ్చాడని, తనని చెట్టబట్టి తన తనువు మనసు ధన్యతనొందిస్తాడని మురిసిపోయింది అందమూ, పెద్ద హోదాగల ఉద్యోగమూ చక్కని రూపమూ అన్నీ వున్న మగవాడు వయసుతోవున్న కోడెకాడు దొరకడం అంటే



మాటలా? భగవంతుడు నిజంగా దయాపూర్ణుడు. చిన్నతనం నుంచే తనేది పదిలంగా చూసుకుంటూ వస్తోందో దానికే ప్రాధాన్యత నిచ్చి తన కోరికలను ఫలవంతం చేస్తున్నాడు.

మర్నాడు హిమబిందుకు, శ్రీపతికి వివాహం అన్నవార్త గుప్పుమంది ఆఫీసులో. చాలామంది ముఖాలు మాడిపోయాయి. అంతర్గతంగా ఆమె నారాధిస్తున్న అవివాహితులంతా శ్రీపతి అదృష్టానికి అసూయ పడ్డారు. చాటుగా తిట్టిపోశారు. తమకి దక్కని ఆమెని గురించి వలవల ఏడ్చినవారు కూడా లేకపోలేదు. అన్నీ వింటూనే వుంది హిమబిందు.

"కొడితే ఏనుగు కుంభస్థలాన్ని కొట్టాలి గాని ఎద్దు మూపురాలు తన కెందుకు? తనకి అన్ని విధాల నచ్చిన తగిన వ్యక్తిని తను చేసుకోవడానికి ఈ బోడి వెధవల ఏడుపేమిటి? తనవంటి సౌందర్యవతి పాలరాతి మందిరాల్లో హంసతూలికా తల్పంలో ఎయిర్ కండిషన్డ్ రూముల్లో ఖరీదైన చీరలతో ముస్తాబయి పవళింపు సేవ చేయాలిగాని వో ముతక చీరలో వంటగదిలో పళ్ళెలు కొడుతూ వో రెండు గదుల అద్దె కొంపల్లో పడి వుండాల్సిన గతి. ఖర్మ ఏమీ లేదు. వీళ్ళల్లో ఎవడిని చేసుకున్నా తన బతుకు గొర్రెతోకే. ఒక్క మగాడికీ ముచ్చటగా వుండటం తెలియదు. ఏదో వేషమంటే వేస్తారు ఆ డ్రస్సు అందమా? చందమా!" అనుకుంది ఈసడింపుగా:

శ్రీపతి హిమబిందును చేసుకుంటున్నాడని తెలియగానే కలుక్కుమంది మాధవి హృదయం. ధనం ఉన్న చోటికే మరికొంత ధనం చేరుతుంది, అది లోక సహజం పెద్ద డాబూ దర్జా వున్న శ్రీపతికి బ్యూటీ క్వీన్ వంటి హిమబిందు అర్ధాంగిగా తగినదే. పైగా ఆమె అతని పి. ఏ. జీతానికి లోటు లేదు. ఎటొచ్చీ కుటుంబ భారం మీద పడిన పోషించాల్సినవారున్న సభ్యులుగల తనలాంటి బొటాబొటీజీతం, రెక్కాడితేగానిడొక్కాడని పరిస్థితిలోవున్న సగటు జీవిని ఎవరు చేసుకుంటారు? తనలాంటి వ్యక్తే తన పరిస్థితులు వున్నలాంటి వ్యక్తే వస్తాడు. అతనికి కొన్ని అప్పులుంటాయి. అవి తీర్చడానికి కట్నం కావాలని ఆశపడతాడు. అతని కోరిక మేరకు తను కట్నం ఇస్తే సంతోషంగా తనని అర్ధాంగిగా స్వీకరిస్తాడు. అలాంటి వ్యక్తి దొరకాలన్నా తను డబ్బు కూడబెట్టుకుని నిరీక్షిస్తుంటేగదా. వచ్చి మూడు ముళ్ళు వేయడానికి; అయినా తనకిప్పుడు పెళ్ళి, సంసారమే తక్కువయింది" అనుకుంటూ బాధగా ఆక్రోశించింది మాధవి.

## 3

ఒక శుభముహూర్తాన శ్రీపతి, హిమబిందులు దంపతులయ్యారు. ఆఫీసు కంతటికీ రిసెప్షన్ యిచ్చారు. ఆ రిసెప్షన్‌కి మాధవి కూడా హాజరయింది. తాను తెచ్చిన రాధామాధవుల విగ్రహం హిమబిందు ఎవరితోటో మాట్లాడుతుండగా చూసి శ్రీపతి చేతిలో వుంచింది. అది నవ్వుతూ అందుకున్నాడు శ్రీపతి. ప్యాకెట్ తీసిచూసి "వెరీ ఫైన్ చాలా చక్కగా వుంది." అన్నాడు శ్రీపతి అభిమానంగా మాధవి వంక చూస్తూ.

రాధ కన్నులలోని ప్రేమ వాహిని ఒక్క మాధవునికే అర్థం కాగలదు. ఆమె అదృష్టవంతురాలు కనుక అర్థం చేసుకునే రసపిపాసి లభించాడు. కాని తన మూగబాసలను తన నయనాలతో వెలిగే రాగతరంగాలను శ్రీపతి ఏ నాటికీ అర్థం చేసుకోలేడు. అదిమాత్రం నగ్నసత్యం. అతని జీవితగమ్యం నెరవేరింది. అతన్ని త వాడిగా చేసుకు తనంత అదృష్టవంతు



## మీకు తెలుసా ?!

### అర్జున అవార్డు విజేతలు

1976వ సంవత్సరానికి పదిమంది క్రీడాకారులను అర్జున అవార్డులకు ఎన్నిక చేశారు. వారిలో నలుగురు స్త్రీలు, ఆరుగురు పురుషులు వున్నారు. వారి పేర్లు :

[1] కుమారి శాంతారంగస్వామి [క్రికెట్]
[2] కుమారి అమిఘియా [బాడ్మింటన్]
[3] కుమారి గీతజెట్షి [అథెలిటిక్స్]
[4] కుమారి శైలజాసలోఖి [టేబుల్ టెన్నిస్]
[5] బహదూర్ సింగ్ [అథెలిటిక్స్]
[6] డి. యస్. రామచంద్ర [ఖోఖో]
[7] హెచ్. ఎస్. సోధి [గుర్రపుస్వారి]
[8] ఎ. ఎస్. క్రిష్టదాస్ [బాల్ బాడ్మింటన్]
[9] జార్జి [వాలీబాల్]
[10] ఎస్.కె. బాలమురుగానందమ్ [వెంయిట్ లిఫ్టింగ్]

( సేకరణ : ప్రసాద్)

రాలు కూడా లేదని హిమబిందు నిరూపించింది. అందులోనేకాదు, అదృష్టంలో కూడా ఆమె డామినేషన్ కనిపిస్తోంది.

హిమబిందు మాట్లాడటం పూర్తయిపటుంది. ఇటుతిరిగి శ్రీపతి చూస్తున్న బొమ్మకేసి దృష్టి సారించింది.

"మాధవి ప్రెజంటేషనా?" అనడిగింది నవ్వుతూ.

"ఏదో సింపుల్‌గా" తనూ నవ్వుతూనే బదులిచ్చింది మాధవి.

"మరే! రాధామాధవుల్లా జీవించమని మాధవి మనలను ఆశీర్వదిస్తోంది." శ్రీపతి చిలిపిగా భార్యకేసి చూస్తూ బదులిచ్చాడు.

"ఆమె చెప్పినా చెప్పకపోయినా మనం అన్యోన్య దంపతులమే" హిమ నవ్వింది.

"రాధామాధవులు ప్రేమైక జీవులు మాత్రమే! వారు దంపతులని ఎవరూ అనలేదు." మాధవి నవ్వుతూ అని "రాధ కన్నులలోని తదాత్మ్యతను. మాధవుని కన్నులలో కృపావీక్షణాలను చూసినప్పుడు భార్యగా అంటిపెట్టుకుని ఉండలేకపోయినప్పటికీ దూరంగానే మసలుతున్నప్పటికీ. ఆమె అనురాగాన్ని, ఆరాధనని గోపాలుడు గుర్తించి తన హృదయంలో రవ్వంత స్థానం యిచ్చి ఆర్తిగా ఆమెని ఏనాటికైనా గుండెల్లో దాచుకోకపోడన్న రాధ తపనని, కాంక్షను గుర్తుపెట్టుకుంటే చాలు," అంటూ చూసీ చూడనట్టు శ్రీపతికేసి చూసి, హిమబిందుకు షేక్‌హ్యాండ్ యిచ్చి తన కుర్చీదగ్గరకి వెళ్లిపోయింది.

శ్రీపతికా మాటల్లో ఒక్కటీ అర్థం కాకపోయినా ఆమె చెప్పిన తీరుమాత్రం హృదయంలో బాగా నాటుకుపోయింది.

"మాధవి ఈమధ్య కొత్తగా కథలు రాస్తున్నట్టు అనుమానంగా వుంది" నవ్వుతూ అన్నాడు శ్రీపతి.

"ఇంకా రచనా వ్యాసంగంలో పడలేదుగాని, ముందు కాస్తో కూస్తో అనుభవం సంపాదిస్తున్నాను. ఆ తర్వాత ఏకంగా ఆత్మకథ రాసుకోవచ్చు." అంటూ ఆగి జవాబిచ్చి వెళ్లిపోయింది మాధవి.

శ్రీపతి, హిమబిందులు ఒకరినొకరు చూసుకుంటూ కొంటెగా నవ్వుకున్నారు.

మల్లెల పానుపును శ్రీపతి, హిమబిందులే అలంకరించుకున్నారు. తన సౌందర్య పిపాసని అందులోకూడా చూపించింది హిమ. మల్లెదండలు అటు ఇటూ మార్చి, మార్చి చూసుకుని తనకి వచ్చిన భంగిమలో సరి చేసుకుని తృప్తిపడింది. ఇదంతా గమనించి శ్రీపతి నవ్వుతూ "మొత్తానికి నీకు కళాత్మక హృదయం వుందని ప్రతి పనిలోనూ ఋజావు చేస్తున్నావు." అంటూ దగ్గరకి లాక్కున్నాడు.

జీవితంలో మరలరాని, మరువురాని మధురాతి మధురమైన తొలిరేయి ఎంత తీయగా, ఎంత మత్తుగా ఎంత ఆనందంగా గడపాలని హిమబిందు కలలు కంటూ వచ్చిందో అంత మధురంగానూ గడిచిపోయింది ఆమెకి. తన కోరికలకు, తన అభిరుచికి దీటైన భర్త లభించాడని మురిసిపోయింది అతని గాఢ పరిష్వంగంలో కరిగిపోతూ.

శ్రీపతి హృదయమూ మేఘాలలోనే సంచరిస్తోంది. ఇంత అందమైన, దేవకాంతలనే ధిక్కరించే రూపలావణ్యాలు గల తరుణి తన అర్ధాంగలక్ష్మి కావడం అనేది తన పూర్వ జన్మ సుకృతమే అనుకున్నాడు. కాలుక్రింద పెట్టకుండా ఎంతో అపురూపంగా చూసుకోవాలని గట్టిగా నిర్ణయించుకున్నాడు.

తెల్లవారి బద్ధకంగా లేచిన హిమబిందును వెళ్ళనీయకుండా ఆపి బాగా దగ్గరకి లాక్కుంటూ "హిమా ఉద్యోగానికి రిజైన్ చేసేయరాదా?" అన్నాడు ప్రేమగా.

"పరాయివారెవరి దగ్గర పనిచేస్తున్నానని మీదగ్గరేగా" అంది గోముగా అతని క్రాపు సవరిస్తూ.

"అవుననుకో: కాని అంతా నీ మనోహర మూర్తినే కాంక్షగా చూస్తే నేను భరించలేను."

"మరీ సిల్లీగా మాట్లాడకండి. మీభార్య అయ్యాక ఎవరికి దమ్ములుంటా యేమిటి?" కిలకిలా నవ్వింది.

"మొత్తానికి జాబ్ వదలనంటావు".

"అవును మంచి జీతం వదులుకోవడం దేనికి? ఇద్దరం సంపాదించుకుని డబ్బు బాగా నిలవేసుకోవచ్చు".

శ్రీపతి మాట్లాడలేదు. అతనికి హిమబిందు ఉద్యోగం చేయడం బొత్తిగా యిష్టం లేదు. కాని హిమ మానేటట్టు కనిపించలేదు మరీ గట్టిగా చెప్పే ధైర్యం లేక "పరే ఆమెనరదా పాడుచేయడమెందుకు ఆమె అన్నట్టు తనతోపాటే ఆఫీసుకు వస్తుంది. తనరూంలోనే వుంటుంది. మళ్ళీ తనతో యింటికి వస్తుంది." అని సమాధానపడ్డాడు.

(ఇంకా వుంది)

## ఆలి కావాలి!

ఆలి కావాలి
నాకొక తోడు కావాలి
నా ఇల్లు వెలిగించు
ఇల్లాలు కావాలి
నా ముద్దు – మురిపాలు
తీర్చు – వయ్యారి కావాలి
సయ్యాట లాడాలి
నా సరసనుండాలి
కార్యసాధనలోన
కుడిభుజము కావాలి
అలసి సొలసిన నాకు
ఆనంద మివ్వాలి
చిన్నారి బాలలకు
తల్లి కావాలి
చిఱునవ్వు లొలుకుతూ
చెంతనుండాలి
ఆలి కావాలి
నాకొక తోడుకావాలి.

— 'ప్రియబాంధవి'

# జి. వి. జి. పేజీ

## చివరకు మిగిలేవి కప్పులూ, చిప్పలూ

కొత్తగా పెళ్ళయింది. కోరికలకు చోటు చాలడంలేదు. ఒక మిత్రుని సలహాతో వేరింటి కాపురం పెట్టి భార్య పద్మావతిని సంతోష పెట్టా లనుకున్నాడు శేషగిరి. అతను బాడ్మింటన్ ఆటగాడు — స్టార్ ఆఫ్ ఇండియా. అయితేనేం — ఆటలో వున్న నైపుణ్యం మాటలో లేదు. శరీరాని కున్న పెరుగుదల మెదడుకు లేదు. అందుకే భయపడుతూనే తండ్రిని కట్నం అడిగాడు. "ఏం కూశావురా? నీకు కట్నం డబ్బు కావాలా? ఎక్కడుందిరా కట్నం డబ్బు? అసలు కట్నం యిచ్చిన వాడెవడురా?" అని అరిచిన రాజశేఖరం అప్రయత్నంగా కోడలుపిల్ల పద్మ వంటిల్లు కవ్ పడకిల్లు తలుపుకు అతుక్కుపోయి వుండటం గుర్తించి, ఇట్టే ప్లేటు మార్చేశాడు. "ఇన్నే మాత్రం — నీ కన్నతండ్రి నీకు జమాఖర్చులు చెప్పాలా? రాస్కెల్! అయితే — నా డబ్బు నా కివ్వరా! నిన్ను పాతికేళ్ళు పెంచి, పోషించి, పెళ్లి చేసిన ఖర్చులన్నీ బిల్లు రాస్తానురా. కట్టరా... తండ్రి ఋణం రూపాయల్లోనైనా తీర్చరా!" అంటూ ఎంత చెప్పినా, అరిచినా శేషగిరి వినేట్టు కనబడకపోయేసరికి "కట్టుబట్ట లతో పొండి!" అని ఆఖరి మాటగా చెప్పేసి, ఆవేదన భరించలేక మంచంమీద పడ్డాడు రాజశేఖరం. బాడ్మింటన్‌లో గెలుచుకున్న కప్పులన్నీ మూట కడుతూ, "ఇవి నా సొంతం" అని గొణిగాడు శేషగిరి. "అంతే — కప్పులూ, చిప్పలూనూ. అవే మనకి మిగిలేవి" అన్నాడు రాజశేఖరం పాత్రలో రావు గోపాలరావు. పద్మ శేషగిరి జంటగా వాణిశ్రీ శ్రీధర్ నటించిన చిత్రకల్పన వారి "గోరంత దీపం" ఈస్ట్‌మన్ కలర్ చిత్రం విడుదలకు సిద్ధమవుతోంది. బాపు దర్శకుడు, ముళ్ళపూడి వెంకటరమణ రచయిత, నిర్మాత.



'చిలిపి కృష్ణుడు'లో అక్కినేని, వాణిశ్రీ

## కొత్త సంవత్సరంలో మరో కొత్త చిత్రం విడుదల

ఎ. ఎన్. ఆర్ తో డి. రామానాయుడు నిర్మించిన "చిలిపి కృష్ణుడు" వర్ణచిత్రం కూడా జనవరి విడుదల. వాణిశ్రీ, శ్రీవిద్య, శుభ, రమాప్రభ, జయలక్ష్మి, సూర్యకాంతం, శాంతకుమారి, కొత్తనటి మోహిని, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లురామలింగయ్య, రాజబాబులతో పాటు గుమ్మడి, రావు గోపాలరావు, నాగేష్ వగైరా నటవర్గం. బోయిన సుబ్బారావు దర్శకుడు.





'ప్రయాణంలో పదనిసలు'

## జి. వి. జి. పేజీ

### బిడ్డకోసం

"పొద్దుటేలే ఈ పనెట్టుకున్నావేంటే ?" అన్నాడు రోశయ్య పిడకలు కొడుతున్న చిట్టెమ్మను చూసి.

"ఈ వానసకన్నా వాంతులవుతాయేమోనని... మన పెళ్లి జరిగి పదేళ్ళవుతోంది. ఇందాకా నలుస్సైనా కలుగలేదు" అంది చిట్టెమ్మ.

"నా శ్రీ జా లా గ వే! నలుసేం ఖర్మ. బొమ్మిడాల్లాంటి కవలం పిల్లలు పుడతారు."

"ఆఁ. పుడతారు. కాపురానికొచ్చాక నా కళ్ళ ముందు ఎదురింటోళ్ళ గేదె మూడుసార్లు ఈనింది. నాకు ఒక్కసారి సరదాకయినా వాంతు అయ్యాయికాదు. డోక్కుందామని అడ్డమైన గడ్డి తిన్నా — అరింమకుపోతాంది," అంటూ ముద్దు ముద్దుగా చిట్టెమ్మ (సుధ)తో రోశయ్య (అంకినీడు ప్రసాద్) సరసాలాడే ఘట్టం యువ చిత్రవారి "సీతామాలక్ష్మి" లోనిది. కె. విశ్వనాథ్ దర్శకుడు. కొ ట్రగడ్డ మురారి నిర్మాత. సమర్పణ : కె. నరసింహం, బి. ఇ.

### నా పేరే హడల్

"నా పేరే హడల్
నా మాటే సవాల్
ఆకలిగొన్న బెబ్బులికైనా — నా
అలికిడి వింటే హడల్ !"

అంటూ మారు వేషంలోని శోభన్‌బాబు - విలన్ మోహన్‌బాబును, అతని అనుచరులను ఆట పట్టించే సన్నివేశం కౌముదీవారి "నాయుడు బావ" వర్ణచిత్రం కోసం యిటీవల వాహినీ స్టూడియోలో సర్వజనరంజకంగా చిత్రీకరింప బడింది. పి. చంద్రశేఖర్‌రెడ్డి దర్శకత్వంలో ఎం. ఎస్. రెడ్డి నిర్మించిన ఈ చిత్రం జనవరి విడుదల. జయసుధ, జయప్రద, సత్యనారాయణ, రాజబాబు, సాక్షి రంగారావు, మమత, జయమాలిని, విజయలక్ష్మి యితర తారాగణం. మాటలు, పాటలు : మల్లెమాల.

### ఈడేరిన కోర్కె

"హమ్మయ్య! యింత కాలానికి నా జీవితాశయం నెరవేరింది. ఈనాటికైనా నేను శాంతారాం గారి దర్శకత్వంలో — ఒక్క షాట్‌లోనైనా పని చేయగల్గడం నా పూర్వజన్మ సుకృతం" అన్నాడు దిలీప్‌కుమార్ నవంబర్ 18న రాజ్‌కమల్ స్టూడియోలో మనోజ్‌కుమార్ సమర్పించే "క్రాంతి" చిత్రం ప్రారంభోత్సవ సందర్భంలో తొలి షాట్‌కు ఆ స్టూడియో అధినేత వి. శాంతారాంగారే దర్శకత్వం వహించవలసిందిగా మనోజ్ కోరాడు. మనోజ్ ఈ చిత్రానికి దర్శక నిర్మాతే కాక ఎడిటర్ కూడా. అతనితోపాటు దిలీప్‌కుమార్, శశికపూర్, హేమమాలిని, పర్వీన్‌బాబి, శత్రుఘ్నసిన్హా, ప్రేమ్‌చోప్రా నటిస్తున్నారు. కథ, స్క్రీన్‌ప్లే : సలీమ్ జావేద్.

'పట్నవాసం'లో కృష్ణ



### విలువకాని మందు విందు

ఏటా బొంబాయి ఫిల్మ్ గిల్డ్ సభ్యుల సమావేశానంతరం మందు పార్టీ చేసుకునే అలవాటుండేది. ఈమారు శాంతారాంగారి రాజ్‌కమల్ స్టూడియోలో సమావేశం ఏర్పాటు చేయబడినందున అందుకు వీలు కాలేదు. ఆ స్టూడియోలో మద్యం నిషేధం. అంతేకాదు; అక్కడి థియేటర్లలో పొగతాగడానికి కూడావీల్లేదు.

### ముందు జాగ్రత్తలు

"ఈ చలనచిత్ర పరిశ్రమ మునుపటిలా లేదు. విపరీతమైన మార్పులు వచ్చేస్తున్నాయి. ఇందులో నేను మహా వుంటే — మరో రెండేళ్ళు వుండొచ్చు. ఆ తర్వాత నా స్థానాన్ని మరొకరు ఆక్రమించేస్తారు" అనే అమితాబ్ బచ్చన్ నటించే చిత్రాలన్నీ యికపైన బొంబాయిలో అతను కొత్తగా నెలకొల్పిన సంస్థ ద్వారానే పంపిణీ చేయబడతాయి.

బొంబాయి సమీపాన బాంద్రాలో వహీదారెహమాన్ నవనాగరిక సౌందర్య పోషక పదార్థాలు విక్రయించే ఒక కాస్మటిక్ షాప్‌కు యజమానురాలు.

హీరో రాజేంద్రకుమార్ అత్యాధునికమైన యంత్ర పరికరాలు గల "డింపిల్ థియేటర్" అనే రీ—రికార్డింగ్, ప్రివ్యూ థియేటర్‌ను బొంబాయిలో నిర్మించాడు.

"షోలే" చిత్రానికి దశాబ్దం ముందు స్వర్గీయ కె. ఆసిఫ్ నిర్మించిన "లవ్ అండ్ గాడ్" చిత్రంలో అమ్జద్‌ఖాన్ ఓ ప్రధాన భూమికను నిర్వహించాడు. ఈ చిత్రం త్వరలో విడుదల కానున్నది. ఇతను నైజాం ప్రాంతాలకు ఒక పంపిణీ సంస్థను యిటీవల స్థాపించాడు. ఇతని తమ్ముడు నటుడు, దర్శక నిర్మాత ఇమ్తియాజ్‌ఖాన్ నిర్మించిన మాయాదీప్ వారి "కృష్ణ కరీమ్ కార్టర్" ఈ పంపిణీ సంస్థ ద్వారా విడుదల చేయబడే తొలి చిత్రం. ★

# సినిమా విశేషాలు



'ముత్తైదువు'

### హాస్య నటుడి చిత్రానికి కొత్త దర్శకుడు

ప్రముఖ హాస్య నటుడు శ్రీ రాజబాబు లోగడ రెండు చిత్రాలని నిర్మించారు ఒక చిత్రంలో భాగస్వామిగా, మరొక చిత్రానికి నిర్మాతగా ఆయన రెండింటిని అందించారు

రాబోయే ఏప్రిల్‌లో కొత్తతరహా చిత్రానికి సరిపడే కథను, రాజబాబుగారే సృష్టించారు

ఉత్తమశ్రేణి దర్శకుల జాబితాలో ఒకరుగా పేరు తెచ్చుకున్న శ్రీ సింగీతం తన చిత్రానికి దర్శకత్వం నిర్వహించగలరని, శ్రీ రాజబాబు వెల్లడించారు

### నా పేరు బాబు

శ్రీ రాజబాబు నిర్మించబోయే చిత్రానికి యిడిన పేరు యిది ఈ చిత్రానికి భమిడిపాటి రచన్ను, రాజబాబు కథాసంవిధానాన్ని సమకూర్చగలరు తెలుగు చిత్ర హాస్య ప్రముఖులు అతిథి పాత్రలను యీ చిత్రంలో పోషించగలరు

### మూడు చిత్రాలలో కృష్ణ, చిత్ర

హీరో కృష్ణ, జయచిత్ర కలిసి నటించిన మొదటి చిత్రం ''సాహసగాళ్ళు'' శతదినోత్సవాన్ని ఎవిచూచిన తరువాత, ఆ జంట మరెన్నో చిత్రాలలో కనిపించగలరని ప్రేక్షకులు ఆశించారు

ప్రజలు మెచ్చే కొన్నిటిని పరిశ్రమ అమలు జరిపితే ఎంతో బాగుంటుంది కానీ, చిత్ర నిర్మాణంలో ఎన్నో టెక్నికల్ యిబ్బందులు వుండడంవల్ల, కొన్ని జరగకుండాపోతాయి

ప్రస్తుతం ''కృష్ణ చిత్ర''లు మూడు చిత్రాలలో కలిసి నటిస్తున్నారు ఒకటి ప్రసన్నలక్ష్మి పిక్చర్స్‌వారి ''ముత్తైదువు'', శ్రీ వెంకటరత్నం (''కొత్త కాపురం'' నిర్మాత) నిర్మిస్తున్న ''ముత్తైదువు'' చిత్రానికి శ్రీ పి సి త్రిలోక్‌చందర్ దర్శకుడు

సారధీ స్టుడియోస్ శ్రీ కె ఎస్ ఆర్ దాస్ దర్శకత్వంలో నిర్మిస్తున్న వర్ణచిత్రం రెండోది శ్రీ లక్ష్మీనారాయణ కంబైన్స్ రంగుల్లో నిర్మిస్తున్న ''అందడు ఆగడు అదరడు'' చిత్రం మూడోది శ్రీ ఎస్ డి లాల్ దర్శకుడు శ్రీ రామస్వామి శ్రీ లక్ష్మణరావు నిర్మాతలు

### కృష్ణ వితరణ

ఆంధ్ర ప్రదేశ్‌లో సంభవించిన భయంకర తుఫాన్ బాధితులకు హీరో కృష్ణ పెద్ద ఎత్తున సహాయం చెయ్యడానికి నిర్ణయించారు

పదివేలు పంపడంతో సరిపెట్టుకోక రాబోయే సంవత్సరంలో తన చిత్రాల పారితోషికం నుంచి పది శాతం విరాళంగా యివ్వడానికి నిర్ణయించారు

సాటి సోదరులు కష్టంలో వున్నప్పుడు, వారిని ఆదుకోవడం తన కనీస ధర్మంగా భావించే హీరో కృష్ణను ప్రజలు కలకాలం గుండెల్లో దాచుకోగలరు

# సినిమా

## సినిమాస్కోప్ అండ్ కలర్ లో గిరిబాబు కథ

జయభేరి ఆర్ట్ పిక్చర్స్ ప్రముఖ ప్రతినాయక పాత్రధారి గిరిబాబు ఆధ్వర్యంలో నిర్మించిన "దేవతలారా దీవించండి" చిత్రం డిశంబర్ 10కి అన్ని హంగులు పూర్తి చేసుకుంది. డిశంబర్ 30న విడుదల చేయడానికి కృతనిశ్చయులయ్యారు చిత్ర నిర్మాతలు. మీ తర్వాతి చిత్రం ఎప్పుడు అని గిరిబాబు నడిగాను. "'78 ఫిబ్రవరి నుంచి మరో చిత్రం ప్రారంభించాలనుకుంటున్నాము. ఈసారి కూడా సినిమాస్కోప్ చిత్రమే అడిషనల్‌గా స్కోప్‌కు కలర్ జోడించాలనుకుంటున్నాము. మరొక క్రొత్త విశేష మేమిటంటే కథ నేనే ప్రిపేర్ చేస్తున్నాను. మిగిలిన వివరాలు డిశంబర్ 31న తేదీ తెలియచేస్తాను" అన్నారు గిరిబాబు.

"దేవతలారా! దీవించండి" చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం నిర్వహించిన కొమ్మినేని శేషగిరిరావు కృషి ఫలించింది. ఫస్ట్ పిక్చర్ నూరు రోజుల వైభవాన్ని చవిచూచే విధంగా కడు శ్రద్ధ వహించారు కొమ్మినేని. షాట్ డివిజన్, పిక్చరైజేషన్, నెరేషన్ చాలా స్పష్టంగా సింపుల్‌గా మలిచిన కొమ్మినేనిని పెక్కుమంది ప్రశంసించారు. ఫ్యూచర్ వుందని మెన్నుతట్టారు. పూర్తిగా సినిమాస్కోప్‌లో నిర్మింపబడిన ఒక బ్లాక్ అండ్ వైట్ చిత్రానికి దర్శకత్వం వహించే అదృష్టం కొమ్మినేనికి రావడం అతని విజయానికి శుభసూచకం అని చెప్పొచ్చు. ఇటీవలే ఈచిత్రం ప్రొజెక్షన్ చూడడం జరిగింది. అందులోని కొన్ని హైలైట్స్‌ను మీకూ తెలుపుతున్నాను.

పాము, ముంగిస ఫయిట్ చాలా బాగుంది.



'గోరంత దీపం'లో ఒక సన్నివేశం

"మీ చిత్రానికి "దేవతలారా! దీవించండి" అని పేరెందుకు పెట్టినట్టు? అనడిగినందుకు యిలా చెప్పారు గిరిబాబు. "కొంతమంది మానవులు మూర్ఖత్వంతో, దేవతల్ని, దైవాంశ సంభూతుల్ని నిందిస్తారు. హింసిస్తారు. అది తప్పే. కానీ దేవతలు కూడా మానవులకు మల్లె వారు చేసిన అకార్యానికి బదులుగా ప్రతీకారం తీర్చుకోడానికి నిశ్చయిస్తే, మానవులకు, దేవతలకు తేడా ఏం వుంటుంది? తప్పు చేసినవాళ్లను దండించవలసిందే. కానీ ఆ దండన వారి బంధువులకు, ఆత్మీయులకు ఆవేదన కాకూడదు పవిత్రమైన భక్తికి ప్రతిఫలం ఎప్పుడూ వుంటుంది. ప్రయోజనంలేని మూర్ఖత్వానికి శిక్ష వుండాల్సిందే. కానీ ఆ శిక్ష కక్షగా మారకూడదు. అనే విషయాలను విశదపరచే కథ గనుకనే మా చిత్రానికి "దేవతలారా! దీవించండి" అని పేరు పెట్టాము.

నల్లమలై అడవుల్లో చిత్రీకరించిన దృశ్యాలు, తడ అడవుల్లో చిత్రీకరించిన దిగోబా జాతి ఆచార, వ్యవహారాలు, పులి, కొండచిలువ ఫయిట్ వుత్తేజాన్ని, గగుర్పాటును కల్గిస్తాయి. ఇటీవల కాలంలో ఈ చిత్రం రీ రికార్డింగ్‌కు వుపయోగించినన్ని ఇన్‌స్ట్రుమెంట్స్ మరే చిత్రానికి వుపయోగించలేదని విజయా గార్డెన్స్ సౌండ్ ఇంజనీర్ పాయింటౌట్ చేసారుగనుక రీ–రికార్డింగ్ బాగుంటుందని వూహించవచ్చు.

మాగంటి వెంకటేశ్వరరావు, అప్పంగి నాగేశ్వరరావు నిర్మించిన ఈ చిత్రానికి జి. సత్యనారాయణ, వై. శేషగిరిరావు సహనిర్మాతలు. చంద్రమోహన్, రంగనాథ్, గిరిబాబు, ఈశ్వరరావు, హరిబాబు, రంగారావు, అల్లు రామలింగయ్య, మాడా, సాక్షి రంగారావు, ప్రభ, జయమాలిని, రమాప్రభ, అనిత, ముఖ్య పాత్రలను పోషించిన ఈ చిత్రానికి వై. రామచంద్రరావు సహకార దర్శకుడు. తారకరామా, శ్రీ తారకరామా, నవభారత్ పంపిణీదారులు.

## అనాథలందరూ చరిత్రహీనులా?

ఈ ప్రశ్నకు జవాబొక్కటే. అనాథలందరూ చరిత్రహీనులెన్నటికీ కారు. పరిస్థితుల ప్రభావంవల్ల, వాళ్ళ పెద్దవాళ్ళు చేసిన పొరబాట్ల వల్ల కొందరనాథలౌతారు. తప్పు చేసేది ఒకరైతే, శిక్ష అనుభవించేది మరొకరు అన్నట్టు దుడుకుతనంతో, తొందరపాటుతో, అమాయకత్వంతో కొందరతివలు, కొందరు మగాళ్ళు చేసే అకార్యాలు వారి పిల్లల్ని అనాథలుగా చేస్తాయి, అన్నీ వున్నా ఎవ్వరూ, ఏమీలేని జీవితాన్ని గడిపే స్థితిని కల్గిస్తాయి. అదృష్టం బాగుంటే కొందరు తమ, తమ తల్లిదండ్రుల్ని చేరుకుంటారు. దురదృష్టం ఎదురైతే కొందరు అనాథలుగానే మిగిలిపోతుంటారు. ఈ నిజాన్ని నిర్దుష్టపరుస్తూ నిర్మింపబడిన చిత్రమే శ్రీ శరత్ చిత్ర వారి "చరిత్రహీనులు."

పెద్దమనిషి అని నమ్మి పైకం తీసుకుంటుందొక పూర్‌గరల్. అతని దగ్గర్నుంచి పైకం తీసుకున్న పాపానికి అతని పైశాచికానికి (కామదాహానికి) బలైంది. ఫలితంగా ఒక బిడ్డ తల్లైంది. కానీ ఏం ప్రయోజనం? ఆ పెద్దమనిషి పెళ్లి కొప్పుకుంటేగా! దగాపడ్డ ఆ మగువ పిచ్చిదైంది. ఆ దుర్మార్గుడిమీద పగతీర్చుకోవాలని పంతంపట్టింది. ఈమెకు కలిగిన బిడ్డడు కాలదోషంవల్ల అనాథ అవుతాడు. అంతమాత్రాన అతను చరిత్రహీనుడౌతాడా!

మంచిమనిషి అని తలచి, మనసిచ్చి, తనువిచ్చిందొక స్త్రీ. నిజాని కతడు మంచివాడే. ప్రేమించినమ్మాయినే పెళ్లి చేసుకోవాలనుకున్నాడు. కానీ పిరికివాడు. అందుకే ప్రాణప్రదంగా ప్రేమించిన ప్రేమికురాల్ని ప్రమాదంలో వదిలేసి వెళ్తాడు. అతని గుర్తుగా ఆ స్త్రీ కొక పాప పుడుతుంది. ఆ పాప ఎక్కడో పెరుగుతుంది. అంతమాత్రాన ఆ పాప చరిత్రహీనురాలు అంటే సమంజసమా?

మగాళ్లతో క్లోజ్‌గా తిరగడం, మాట్లాడడం తప్పులేదని భావించి ఒక మేల్‌తో మిడిమాలంగా తిరిగిందొక వనిత. పెళ్లి చేసుకుంటాడులే అని అపోహపడి ఆపదలో చిక్కుకుంది. కన్నెగానే గర్భవతి అయింది. సంఘానికి భయపడి ఆమెకు గలిగిన బిడ్డను ఎక్కడో వదిలేసారు ఆమె తలిదండ్రులు. అంతమాత్రాన ఆ బిడ్డ చరిత్రహీనుడెలా అవుతాడు?

పిల్లల్ని కన్న తలిదండ్రులు తమ పిల్లల సంగతి మరచిపోయినా, ఆ పిల్లలు మాత్రం తమ తలిదండ్రుల్ని వెతుక్కుంటూ బయల్దేరారు. తెలివిగా తమ తలిదండ్రుల్ని కలుసుకున్నారు. తాము అనాథలు కామని, చరిత్రహీనులు కామని లోకానికి చాటారు. ఇదే "చరిత్రహీనులు' సంక్షిప్త చిత్ర కథ. శ్రీ డి. రాజశేఖరరెడ్డి నిర్మించిన ఈ ప్రయోగాత్మక చిత్రం కె. బాపయ్య దర్శకత్వంలో ప్రయోజనాత్మకంగా తయారైంది

డిశంబర్ 14న విజయా ద్వారా విడుదలయ్యే ఈ చిత్రంలో ముగ్గురు కథానాయికలున్నారు ప్రభ, ఫటాఫట్ జయలక్ష్మి, దీప, చంద్రమోహన్, సత్యనారాయణ, రావు గోపాలరావు, కాంతారావు, సురేష్, మరియు జగ్గయ్య, మాష్టర్ రాము, బేబీ వరలక్ష్మి, బేబీ రాణి, మూన్సి ముఖ్య పాత్రధారులు

### ప్రయాణంలో పెళ్లి ?

ఇది చిత్రం పేరు కాదు సుమా! ఒక చిత్రంలో జరిగిన వింత సంఘటన ప్రేమ్స్ కంబైన్స్ నిర్మించిన ''ప్రయాణంలో పదనిసలు'' చిత్రంలో ఒకబ్బాయికి, అమ్మాయికి ప్లాట్‌ఫారం మీదనే పెళ్లి చేయించేస్తాడొక పెద్దమనిషి తాము ప్రయాణం చేస్తున్న రైలు సడన్‌గా ఒకదగ్గిర ఆగిపోవడంతో అందులోని ప్రయాణీకు లందరూ ప్లాట్‌ఫారంమీదకి రాక తప్పలేదు పాపం! అదే బండ్లో పెళ్లి పార్టీ ఒకటి వెళుతూ వుంది వాళ్లొచ్చిన రైలు కదలడానికి మరో మూడు గంటలసేపు పడుతుందని తెలిసాక అగమ్యగోచరంగా తయారైంది వారి పరిస్థితి అవతల పెళ్లి కానీ పోవడానికి అవకాశం లేదు వాళ్లవస్థను పసిగట్టాడొక పురోహితుడు (ఆ రైలు ప్రయాణీకుడే) పెళ్లి జరిపిస్తానని అభయమిచ్చాడు ''టీ'' కొట్నుంచి స్టౌ పట్టు కొచ్చాడు దానిని ''అగ్ని'' అన్నాడు పసిబిడ్డ కాగుతున్న పాలబుడ్డిని తెచ్చి స్టౌ ప్రక్కన పెట్టి వాల్గు మంత్రాలు చదివి మాంగల్యధారణ చేయించాడు ఏడడుగులు నడిచాక వధూవరుల్ని అరుంధతీ నక్షత్రాన్ని చూడమని, ''అరుంధతీ'' అని అరచాడు ఆ పిలుపు విని ఆ పేరు గల ఒకావిడ పరుగెట్టుకొచ్చింది నిన్ను కాదు పోమ్మా అని ఆమెను పంపించేసరికి బ్రాహ్మడి పని అయిపోయింది పెళ్లి ఎలా జరిపించినా ఒక శుభ కార్యానికి శుభం పలికిన ఆ పురోహితుడు అభినంద నీయుడే నవ్వు పుట్టించే ఈ సన్నివేశం 'ప్రయాణంలో పదనిసలు' చిత్రంలోనిది ఇంతకూ పురోహితుడెవరనుకున్నారు? నాగేష్

యం యస్ కోటారెడ్డి దర్శకత్వంలో యస్ బి శంకర్రావు, యస్ అన్నారావు నిర్మించిన ఈచిత్రం డిశంబర్ మాసాంతంలో విడుదలౌతుంది

—శ్రీనివాస్ ★



సింహస్వప్నం'లో కార్తిక, వై విజయ

ఈ ఫాన్ మెయిల్ లో
మంజుల విజయలలిత

## సీరియల్

# రాగబంధం

### యార్లగడ్డ సరోజినీదేవి

*(గత సంచిక తరువాయి)*

''మేరీతో నీ వివాహం జరగటానికి వీలు లేదు! మామయ్య ఇంతకాలంనుంచి సంపాదించుకున్న పరువుప్రతిష్టలు నీవల్లనే సర్వనాశనం అవుతుందని మరువవద్దు. మేరీ నీ అర్ధాంగి అయిన రోజునే సజీవంగా వుండదు!''

''అయితే నన్నిప్పుడేమి చెయ్యమంటావు విజయా ?''

''మేరీని మేరీగానే వుండనివ్వు !''

''కోర్టుకు ఎక్కితే అప్పుడయినా తప్పదుగా ?''

''తప్పే మార్గం ఆలోచించాను చినబావా?''

''ఏమిటది ?'' ఆత్రుతగా అడిగాడు.

''నేను నిన్ను వివాహం చేసుకుంటాను !''

''నువ్వు ! ... నువ్వు ! ... నన్ను వివాహం చేసుకుంటావా విజయా ?'' నమ్మలేనట్లుగా అడిగాడు.

''అత్తయ్య మామయ్యల ఋణం తీర్చుకోవాలంటే ? వారి పరువుప్రతిష్టలు మంట కలువకుండా కాపాడాలంటే నేను నిన్ను వివాహం చేసుకోవాలి. మేరీ కోర్టుకు ఎక్కినా యేలాంటి భయంలేదు. అవివాహిత ప్రేమలేఖలుతో కోర్టుకి వెళ్లదు. వెళ్లినా నీ అర్ధాంగిగా ప్రక్కన నేనున్నాను ! ...''

''విజయా ! విజయా !'' పట్టరాని సంతోషంతో తొందరగా ఆమె చేతులు పట్టుకోబోయేంతలో విజయ వెనక్కి అడుగువేసింది.

''మనకింకా వివాహం కాలేదు. అయ్యేంత వరకూ దూరంగా వుండాలిసుమా !''

''సారీ విజయా !''

దూరంగా వెళ్లి నిలబడ్డాడు. శ్రీనివాస్ మనసు బాధతో గతం గుర్తించి ఆలోచించసాగింది. తనను వివాహం చేసుకోవటంలో గల విజయ తన సదుద్దేశ్యాన్ని వివరించినప్పటికీ కన్నబిడ్డకి తనకే జ్ఞానంలేక తండ్రిని బెదిరించుతూ డబ్బుకోసం ఉత్తరం వ్రాశాడు. నాలుగేళ్లు చేరదీసి ఆదరించిన విజయ ఆ కుటుంబంకోసం ఎంతగానో తనను తాను త్యాగం చేసుకుంటున్నది. మైగాడ్! తానెంత అల్పహృదయుడు విజయముందు ?

రిజిస్ట్రాఫీసు నుంచి సరాసరి విజయతో కలిసి తోటలోని బంగళాకు వచ్చాడు శ్రీనివాస్. గదిలోకి వెళ్లుతున్న విజయను ఆపి పూలపొట్లం చేతికి యిచ్చాడు. లోపలికి వచ్చిన విజయ అద్దం ముందు కూర్చుని మల్లెలు మరువంవేసి కట్టిన మాలను జడలో పెట్టుకుంది. బైటికి వచ్చిన శ్రీనివాస్ పశ్చాత్తాపంతో కుమిలిపోతూ తోటలోకి వెళ్లి కూర్చున్నాడు. అగ్నిలా దహించుకుపోతున్నది అతని మనసు. పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నాడు. తానెంత పొరపాటు చేశాడు ? కన్న తల్లితండ్రులనే కాదనుకున్నాడు. మేరీ సాంగత్యంలో పడి కన్నూమిన్నూ కానక తనవారినందరినీ దూరంచేసుకున్నాడు. అనుక్షణం విజయని రాసిరంపానపెట్టి తన కసి తీర్చుకునేవాడు. అలాంటిది తనను మేరీ ఇనుప సంకెళ్ల నుంచి తప్పించటానికి తాను పెళ్లి చేసుకుంది. విజయా ! నన్నెలా క్షమించగలవో ? క్షమించి ఆదరించిననాడు నా సర్వస్వం నీకే అప్పచెప్పతాను! జీవితాంతం నీకు అంకితమయి వుంటాను.

విజయ అలా అద్దంముందు కూర్చుంటే మెడలోని పసుపుతాడుని చూసి తాను కలకనటంలేదుకదా ? ఇది నిజమే ! తనకింత నీడనిచ్చిన అత్తయ్య మామయ్య పరువుని బజారున పడకుండా తాను ఆ పరువుకి అంకితం అయింది. త్రాగుబోతు; వ్యభిచారి ! అతి కోపిష్టి మనిషని తెలిసికూడా తాను చేసుకుంది. మనిషిని చూస్తేనే అసహ్యించుకునే శ్రీనివాస్‌కి అర్ధాంగి అయింది. తాను చేసింది సాహసమే అయినా ఆ సమయంలో ఎవరూ లేకుండా ? ఎవరి అనుమతిలేకుండా వ్యక్తిత్వం కోల్పోయిన శ్రీనివాస్‌ని చేసుకోవటం ఒకవిధంగా సాహసమయినా మరొకవిధంగా బాధే కలిగి రెండు చేతుల్లోనూ ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్న విజయను చూశాడు శ్రీనివాస్.

ఎప్పుడూ నవ్వుతూ; ఇతరులను నవ్వించుతూ శాంతమే ఆభరణం అన్నట్లు వుండే విజయ ఏడుస్తుంటే శ్రీనివాస్ మనసు గిజగిజ తన్నుకుంది ఆవేదనతో !

''నేను నిన్ను వివాహం చేసుకుంటాను చినబావా !''

అని విజయ అనగానే సిగ్గుతో బాధతో; అవమానంతో కుమిలిపోయాడు. ఇంతకంటే అవమానం తన కింకేం కావాలి ? విజయ ముందు తను ఓడిపోయాడు. విజయ మంచితనంముందు తను ఓడిపోయాడు. విజయ కావాలనుకుంటున్న పరువుప్రతిష్టల ముందు తను ఓడిపోయాడు తనమీద నమ్మకంతోగాని; పరువుప్రతిష్టకోసమని గాని సాహసించి ఈ వివాహానికి ముందంజవేసిన విజయమీద గౌరవభావం కలిగింది. రిజిష్టర్‌లో సంతకం చేస్తుంటేను; దేవాలయంలో భగవంతునిసాక్షిగా విజయ మెడలో పసుపుతాడుతో మూడుముళ్లూ వేస్తుంటే శ్రీనివాస్ మనస్సూ; శరీరం వింత అనుభూతితో పులకరించిపోయింది. తనలోని శక్తి విజయలోకి పోతున్నట్లనిపించింది.

మూడు ముళ్లూ దేవుని ముందు వేసి విజయను తనదాన్నిగా చేసుకున్నాడు. కాదు ! విజయే తనను చేసుకున్నది.

ఈ విజయ తనది !

తనేమి చేసుకున్నా అడిగేవాళ్లు లేరు !

ఇంత హక్కు ప్రపంచంలో మరి దేనిమీదా వుండదేమో ?

అలా అనుకుంటూవుంటే శ్రీనివాస్‌కి ఎంతో సంతృప్తి; మరింకెంతో ఆనందం కలిగాయి.

''విజయా !...'' పిలిచాడు అనురాగంగా దగ్గిరకు వెళ్లి.

విజయ జవాబు ఇవ్వకపోయేసరికి ముఖాన్ని పైకెత్తి కన్నీటితో వున్న ఆ కళ్లను చూశాడు. కనురెప్పలు తడితో నిగనిగ లాడుతున్నవి. ఎంతో ముద్దు వచ్చాయి ఆ కళ్లు ! ముద్దు పెట్టుకోవాలని ఆరాటంతో ముందుకి వంగికూడా సాహసించలేకపోయాడు.

''ఎందుకా కన్నీరు విజయా !''

''దేవుడులాంటి మామయ్య; దేవతలాంటి అత్తయ్య లేకుండా; వారి అనుమతి లేకుండా నేనిలా వచ్చి వివాహం చేసుకున్నందుకు బాధగా వుంది చినబావా !''

''మవ్వు పరాయివాళ్లను చేసుకోలేదుగా ! వాళ్లబ్బాయినేగా చేసుకున్నది ?''

''అయినా మామయ్య ఈ వివాహానికి సమ్మతించరు. నువ్వంటే మామయ్యకి చాలా కోపం !''

''అలా కోపం రావటం ఎవరికయినా సహజమే ! నేను చేసిన పనులు అలాంటివి. డాడీ ఎప్పటికయినా నన్ను క్షమించగలిగితే నాకదే చాలు !''

''నువ్వేనా చినబావా ఆ మాటలంటున్నది??''

''నిజం విజయా ? నేను పశువుగా ప్రవర్తించాను ! తల్లిని తండ్రిని అందరూ పూజించితే నేను ద్వేషించాను. వారి నీడ సోకితేనే అసహ్యించుకునేవాడిని ! అవన్నీ యిప్పుడు తలుచుకుంటుంటే చాలా బాధగా వుంది.''

''గతం నాస్తి ! ఇకనుంచి నేను చెప్పినవన్నీ నువ్వు వినాలి !''

''అలాగే! ఏమిటో సెలవివ్వండి రాణీగారూ !''

''నువ్వు బార్‌లో కాబరే డాన్సులు ఇకనుంచి మానివెయ్యాలి !''

''అలాగే !...''

''విస్కీ; బ్రాందీలాంటివి త్రాగరాదు !''

''చిత్తం !''

''మరో స్త్రీవంక కన్నెత్తి చూడకూడదు !''

''నీవైపు కూడానా ?''

''నేను నీ భార్యనుగా! నావైపు తప్పించి ఇంకెవ్వరివంకా చూడకూడదు!''

''ఓ. కే!...''

''ఇప్పటివరకటిలాగా పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యకూడదు!''

''వెయ్యను!''

''నీలో చాలా చాలా మార్పు వచ్చిందని నేను సర్టిఫికేట్ ఇస్తేనేగాని మామయ్య నిన్ను నమ్మరు!''

''అమ్మ బాబోయ్! ఇన్ని షరతులా? ఓ మైగాడ్!''

''పెళ్ళంటే ఏమిటనుకున్నావు చినబావా! తాగి క్లబ్బుల్లో తందనాలు ఆడటం అనుకున్నావా? రోజుకో ఇస్త్రీ షర్టు మార్చుకున్నట్టు అమ్మాయిన్ని మార్చుకోవటం అనుకున్నావా? భార్యాభర్తల అనుబంధం అతి పవిత్రమయింది. కష్టానికి; సుఖానికి ఆలంబనమయినవి రెండు హృదయాలూ! మనిద్దరినీ చూసి అత్తయ్య మామయ్య మెచ్చుకోవాలి!''

కుర్చీలోంచి లేచి రెండు చేతులతో శ్రీనివాస్ మెడను చుట్టేసి నవ్వుతూ అతని కళ్ళల్లోకి చూసింది అనురాగంగా!

విజయ అలా కళ్ళల్లో కళ్ళుపెట్టి చూసేకొలదీ ఇదివరకు కనిపించని అందాలు కంటికి స్పష్టంగా కనిపించుతున్నవి శ్రీనివాస్‌కి. ఆ ముక్కు మరీ సూటిగా నాజూకుగా వుంది. ఆ పెదాలు కుంచెతో గీసినట్లున్నాయి. ఛాయ తక్కువయినా ఎంత అందం! తనను అస్తమానం ఫూల్‌నిచేసి మాట్లాడే ఈ విజయ తన భార్య!... తానెంత అదృష్టవంతుడు! దగ్గిరకు తీసుకునే నెపంతో విజయ నడుంచుట్టూ చేతులువేసి మరింత దగ్గిరకు తీసుకుని నుదురుపై ముద్దుపెట్టుకున్నాడు ఆర్తిగా!

## 22

పక్షుల కిలకిలా రావాలతో పూర్తిగా మెలుకువ వచ్చిన విజయ కళ్ళు విప్పి చూసింది. గదిలో బెడ్‌లైటు వెలుతురు గదంతటినీ ఆక్రమించుకోలేకున్నది. గాఢ నిద్రలో వున్న శ్రీనివాస్ పక్కకి తిరిగి పడుకున్నాడు. ఇంత అందమయిన వర్చస్సు వెనుక ఎంత రాక్షసత్వం దాగివున్నదో? తదేకంగా అతని మొహంలోకి చూస్తూ అనుకోసాగింది. చేతిని తన చేతిలోకి తీసుకుని అక్కున చేర్చుకుంది.

ఈ చెయ్యి ఎంత మృధుమధురంగా స్పృశించుతుంది? ఎంత అందమయిన తీపి కలలు మిగుల్చుతుంది??

తలుపుమీద వేలితో సన్నగా కొట్టినట్లయి నడుంచుట్టూ శ్రీనివాస్ చెయ్యి చుట్టేసి వుంటం వల్ల తొందరగా లేచి రావటానికి వీలులేకపోయింది విజయకి. అతనికి మెలుకువ రాకుండా నెమ్మదిగా చేతిని తీసి పరుపుమీద వుంచి లేచి వెళ్ళి తలుపులు తీసింది. ఎదురుగా నిలబడివున్న వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయింది.

''నువ్వెవరవు?'' మేరీ ప్రశ్నించింది కోపంగా;

''నేనెవరినో నీకు తెలియకపోయినా నువ్వెవరివో నాకు బాగా తెలుసు! మేకవన్నె పులివి! కక్కిన కూటికి ఆశపడి మానాభిమానాలను అమ్ముకుని బ్రతికే నీలాంటి వాళ్ళ అంతరించనంతకాలం యువకులు సర్వనాశనం అయిపోతారు!''

''నీ అధిక ప్రసంగం కట్టిపెట్టి శ్రీనివాస్‌ని పిలువు!''

''పిలవటానికి వీలులేదు!''

''ఎందుకని?''

''అతను నా భర్త!... ఆ భర్తమీద సర్వాధికారాలూ నాకున్నవి మర్యాదగా వచ్చిన దారినే వెళ్ళు!''

''నేనెవరినో తెలిసే మాట్లాడుతున్నావా?''

''చెప్పానుగా? నీలాంటి వ్యభిచారులు అంతరించితేనే తప్ప సంసారాలు చక్కబడవని! డబ్బుకోసం బెదిరించుతావా? చర్చిలో నీతో శ్రీనివాస్ వివాహం జరగాలా? లేకపోతే ప్రేమలేఖలు పట్టుకుని కోర్టుకి ఎక్కుతావా?... ఎక్కవే! కోర్టుకికాదు! సుప్రీంకోర్టు ఎక్కు. ఏ కోర్టులు యెక్కినా నాబావ! అదే నా భర్త శ్రీనివాస్ నీవాడు కాలేడు! నిన్ననే మా యిద్దరికీ వివాహమయింది. నేనిప్పుడు శ్రీనివాస్ భార్యను. బిజినెస్ మాగ్నెట్ రామనాధంగారి చిన్నకోడలిని! వెళ్ళు! ఎంత తొందరగా ఇక్కడనుంచి కదిలితే అంత మంచిది!''

''నువ్వు చేసుకున్నావా శ్రీనివాస్‌ని?''

''అవును! నీ వలలోపడి తన సర్వస్వం కోల్పోయాడు శ్రీనివాస్. చివరికి తల్లితండ్రులను సైతం లెక్కచెయ్యని పరిస్థితిలో నేను! నేను! చేసుకున్నానే? ఎందుకో తెలుసా? మా అత్తయ్య మామయ్య పరువుప్రతిష్టలను కాపాడుకోవాలని! నీకు దిక్కున్నదగ్గిర చెప్పుకో!''

''ఉండు! మిమ్మలను ఏంచేస్తానో? కోర్టుల కెక్కించి ముప్పతిప్పలుపెట్టకపోతే నా పేరు! నా పేరు! మేరీయే కాదు!'' అసహనంతో నిప్పులుతొక్కింది మేరీ!

''చచ్చినపాము యింకా చావలేదని తోక కదిలించుతునే వుంటుందట! నీ ఇష్టంవచ్చినట్టు చేసుకో! ఫో! ఇక్కడనుంచి!'' అని—

మాలిని కేకేసి మేరీని బైటికి ఈడ్చమన్నది ఆవేశంగా! మేరీ చిందులుతొక్కుతూ నోటికి వచ్చినట్టల్లా తిట్టుకుంటూ వెనక్కి తిరిగి రెండడుగులు వేసేసరికి ఎదురుగా పార్వతమ్మ కనిపించేసరికి మేరీ ప్రాణాలు పైనే పోయాయి. భయపడుతూ పరుగులాంటి నడకతో నిష్క్రమించింది మేరీ!

''అత్తయ్యా!'' అంటూ పార్వతమ్మ భుజంమీద వాలిపోయింది విజయ.

''నిన్నటినుంచీ నువ్వు ఇంటిలో లేకపోతే ఏ స్నేహితురాలికోసమో వెళ్ళావనుకున్నాం. ప్రొద్దుపోయేవరకూ చూసి నువ్వు రాకపోయేసరికి నీ స్నేహితురాళ్ళందరి ఇళ్ళకూ ఫోన్‌చేసి తెలుసుకుంటే రాలేదని చెప్పారు. ఇక్కడ వున్నావన్న ఆలోచన రాక ఎంతో బాధపడుతున్నాం. కాని విజయా! నువ్వింత సాహసం చేస్తావని కలలోకూడా అనుకోలేదు. నువ్వే అడ్డుకోకపోతే మన కుటుంబం పరువుప్రతిష్ట మంటగలిసేది!''

విజయ నవ్వుతూ వుండిపోయింది. అనుమానం వచ్చినట్టు తిరిగి ప్రశ్నించింది.

''నామీద కోపంలేదుగా అత్తయ్యా!''

''కోపమా విజయా! నువ్వింత సాహసం చేసినందుకు నిన్ను అభినందించుతున్నాను. నేను చేయించవలసిన పనిని నువ్వు చేశావు. ఈ సంగతి మీ మామయ్యకి తెలిస్తే ఎంతో సంతోషించుతారు! శ్రీనివాస్ ఎక్కడ?''

''ఇంకా నిద్రలేవలేదు అత్తయ్యా! రండి లోపలికి వెళ్దాం!''

మేనత్తను చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకువచ్చింది విజయ. మెలుకువతోవుండి అన్నీ విన్న శ్రీనివాస్ తల్లి లోపలికి రావటం చూసి నిద్రపోతున్నట్టు గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

''చిన్నదానివయినా నిన్ను అభినందించకుండా వుండలేకపోతున్నాను!'' అమితానందంతో అంది పార్వతమ్మ.

''నేను మీ మేనకోడలిని అత్తయ్యా! బావ పూర్తిగా మారిపోయాడు. మీరూ మామయ్య క్షమించగలిగితే?''

''అంతకంటేనా? మీ ఇద్దరూ నాకు రెండు కళ్ళవంటివారు తల్లీ!''

[33వ పేజీ చూడండి]

***జరిగిన కథ 14*** **ముప్పయ్యేళ్ళతర్వాత** పుట్టింటి కెళ్ళిన **పార్వతమ్మ**, వదిన జానకి చనిపోవటంతో చిన్ననాడే తండ్రిని, ఇప్పుడు తల్లిని కోల్పోయిన విజయని తనతో తీసుకువస్తుంది. తన ఈ ఉన్నత స్థితికి కారణం భార్య పార్వతమ్మేనని రామనాధం నమ్మకం. పార్వతమ్మ పెద్దకొడుకు భాస్కరం. అతని భార్య సుందరి. సుందరికి నల్గురితో కలసిమెలసి తిరగటం గిట్టదు. చిన్నకొడుకు శ్రీనివాస్‌కి దుడుకుతనం ఎక్కువ. పాతికేళ్ళ క్రితం... పరంధామయ్యగారి కొడుకులు జగన్నాధం, గోపాలంల భార్యలు సుభద్ర, జానకిలు. కాపురానికి వెళ్ళకుండానే వైధవ్యం పొందిన ఆడబిడ్డ పార్వతికి వివాహం చేయటానికి మామగారి అనుమతి తీసుకుంటుంది జానకి. సుబ్బయ్య మాష్టారి శిష్యుడు రామనాధంతో పార్వతి వివాహం జరిపిస్తుంది జానకి. ఇద్దరు మగపిల్లల తల్లవుతుంది పార్వతి. పార్వతి జీవితం చక్కబడిందనే తృప్తితో కళ్ళు మూస్తాడు పరంధామయ్య... విజయ బి. ఏ. లో చేరుతుంది. చదువుమీద శ్రద్ధలేక దురలవాట్లకు లోనైన శ్రీనివాస్ దుడుకు స్వభావాన్ని చూసి బాధపడుతుంది విజయ. శ్రీనివాస్ స్త్రీలోలుడని తెలుసుకున్న విజయకు అతనిపై అసహ్యం కలుగుతుంది. తండ్రిమీద పంతంతో ఇంట్లోంచి వెళ్ళిపోయి క్లబ్‌లో కాబరే డాన్సర్‌గా చేరతాడు శ్రీనివాస్. మేరీ ఉచ్చులో చిక్కుకున్న తనకు ఆమెని పెళ్ళి చేసుకోవటంకన్న మరో గత్యంతరం లేదనుకుంటాడు శ్రీనివాస్.



రాత్రి పదకొండు గంటలయింది. లైటార్పి పడుకున్నాను. కిటికీ లోంచి చతుర్దశి 'వెన్నెల లోపలికి పడుతోంది చల్లగాలికి ఆకులు సుతారంగా కదులుతున్నాయి. నైట్ క్వీన్ తెరలు తెరలుగా సువాసనల్ని వెదజల్లుతోంది. ప్రశాంతంగా వుంది వాతావరణం.

ఎంత ప్రయత్నించినా నిద్ర నా దగ్గరికి రాలేదు. ఇది నా కలవాటే

పడుకోంగానే కమ్మని కలలతో నిద్రపోయే రోజులు పోయాయి నాకు. నిద్రమాత్ర వాడనిదే నిద్రపోలేను నేను. నాకంటే దురదృష్టవంతులు అసలు వుంటారా అనిపిస్తుంది నాకు. మళ్లీ ఆ ఆలోచనకే నవ్వు వస్తుంది. ప్రపంచంలో దురదృష్టవంతులే ఎక్కువ! అదృష్టం — అందరాని దేవత — అది ఏ కొందరికో మాత్రమే దక్కుతుంది.




ందరగా తెల్లవారితే బావుండు నా జీవితంలో వెన్నెల వెలుగు సంవత్సరానికి నాలుగు నెలలే

మిగిలిన ఎనిమిది నెలలూ నేను శూన్యంలో— అంధకారంలో నిలచిపోతాను

రేపు నా చిట్టితల్లి సుధ వస్తుంది నా మోడువారిన జీవితంలో వసంతం తెస్తుంది నవ్వుల కిలకిలలతో నన్ను సమ్మోహితురాల్ని చేస్తుంది

ఈ ఊహే నాకెంతో ఆనందాన్నిస్తుంది కానీ — దాని వెనక చిన్న అసంతృప్తి — సుధతోబాటు నా ముద్దుల మూట — బంగారు తండ్రి మధు కూడా వస్తే ఎంతో బావుంటుంది కానీ - వాడు రాడు వాళ్లిద్దరూ కలిసి ఎప్పుడూ రారు

భారంగా నిట్టూర్పు విడిచాను. వాడు తండ్రి దగ్గిరికి వెళ్తాడు సుధ ఒక్కత్తే వస్తుంది ఇప్పుడు — ఈసారన్నా దాని కిష్టమైన పాలకోవా



క్రిస్మస్ తాత

—ఫొటో : రాధిక

# నేనెవర్ని?

నేను మేలిముసుగు తొలగిస్తే చాలు
వేలకొలది విరగబడతారు ప్రజలు
నిర్మానుష్యమైన అన్ని వీధులు
నిమిషంలో పరుచుకుంటాయి నిగనిగలు

నా కౌగిలికోసం నా వాడి వేడిచూపులకోసం
అర్ధనగ్నంగా అందరూ వస్తారు
బయటకు పాపం
నేను మాయమయ్యానంటే విచారం
వస్తే మరలా పోతానేమోనని ఆరాటం

ప్రతి కవి కలంలోను నామాటే
ప్రతి గాయకుని గళంలోనూ నా పాటే
ఏ యిద్దరి నోట విన్నా నా మాటే
వాళ్ల పెదవుల మధ్య నాకెప్పుడూ అలవాటే

నన్ను చూసి అందరూ
కొడతారు కేరింతలు
నేను వస్తే ప్రకృతికే ఎన్నో పులకింతలు
నేను తొంగిచూస్తే వుండవు
చెట్ల కదలికలు
పవనుడి పదనిసలు ఇంతకీ నేనెవర్ని?
పాశ్చాత్యుల 'లవ్లీ' సూర్యుణ్ణి

[క్రిస్మస్‌కి ముందు రోజుల్లో క్రిస్మస్ తాత అన్ని ఊరులకు వెళ్లి పిల్లలకు బొమ్మలు పంచిపెడతాడు. తారను చూపించి, 'నేను తరువాత యింకా మంచి బొమ్మలు పంపుతాను' అని చెబుతాడు. క్రిస్మస్ తాత పంపినట్లుగా తల్లిదండ్రులే బొమ్మలు కొని శాంతాక్లాజ్ పంపాడని పిల్లలకుఇస్తూ వుంటారు, ఆతరువాత.]

— రాధిక (ఇన్సిస్‌కార్తి బర్మాందు.)



చేసిపెట్టాలి. కిందటిసారి అది వచ్చినప్పుడు నాకు జ్వరం టైఫాయిడ్! "అమ్మా, అమ్మా" అంటూ ఎంత కంగారు పడేది! పిచ్చితల్లి! దానికి చేతనైనంతలోనే నాకు సపర్యలన్నీ చేసింది. చాలా భయపడిపోయింది అప్పుడు. అదీ ధాని సెలవల్లో వచ్చింది కాబట్టి నాకోసం అంత కంగారు పడింది. నాకు కాస్త ఆసరాగా వుంది — లేకపోతే ఆ జ్వరంలో — ఆ వంటరితనంలో నాకు పిచ్చెక్కే వుండేదేమో!

పోయినసారి పట్టు పరికిణీ అడిగింది. కానీ కొనడానికి వీల్లేకపోయింది. ఈసారన్నా కుట్టించాలి. అది వచ్చాక దాంతో షాపింగ్‌కి వెళ్లి దానికి కావలసిన డ్రస్సులన్నీ కొనిపెట్టాలి. రెసిడెన్షియల్ స్కూల్లో చదువుతున్న పిల్లలు — డీసెంట్‌గా వుండాలి. వాళ్లకి మూన్‌లైట్ డిన్నర్లూ — మ్యూజికల్ ఈవినింగ్స్ — ఇల్లాంటి ప్రోగ్రాములు వుంటాయిట. అప్పుడందరూ రకరకాల డ్రస్సులు వేసుకుంటారుట.

'నువ్వు ఒకసారిగూడా రావేమమ్మా?' అని సుధ అంటే —

"అందరి అమ్మలూ వస్తారు. నువ్వుకూడా వస్తే మాకెంతో సంతోషంగా వుంటుంది. రాకూడదా అమ్మా" అంటూ మధు గారాలు పోతాడు.

నేనెట్లా వెళ్తాను?

"నేను అందరి అమ్మలంత అదృష్టవంతురాల్ని కానురా నాన్నా!" నాలో నేనే గొణుక్కుంటాను — ఎప్పుడూ.

అదేమిటో వాళ్లకి అర్థంకాదు.

ఆశ్చర్యంగా చూస్తారు నావంక.

అమాయకంగా నా కళ్లనీళ్లు తుడుస్తారు నా చిట్టిపాపలు!

లేచి కిటికీ దగ్గరకు వచ్చాను. చువ్వకి తల ఆనించి వెన్నెట్లోకి చూస్తుంటే ఏవేవో జ్ఞాపకాలు నన్ను తరుముకొచ్చాయి. ఇంక అక్కడ నిలబడలేక పరుపుమీద వాలిపోయాను.

అదిమిపెట్టిన దుఃఖం కట్టలుతెంచుకుని పైకి వచ్చేసింది. దిండులో తల దూర్చి వెక్కి వెక్కి ఏడిచాను.

* * *

బాలభానుని బంగారు కిరణాలు వెచ్చగా గిలిగింతలు పెడుతున్నాయి — కిటికీలోంచి.

ఉలిక్కిపడి లేచాను.

గడియారం ఏడుగంటలు కొట్టడం వినిపించింది. పిట్టగోడమీద ఒక కాకి కూచుని 'కావు కావు' మని అదేపనిగా అరుస్తోంది.

నేను నవ్వుకుంటూ పక్క దిగాను.

మనసంతా ఉత్సాహంగా—ఉల్లాసంగా వుంది.

స్నానం, పూజ ముగించుకుని కాఫీ తాగాను.

కాలేజీకి సెలవుచీటీ రాసి పంపించాను. ఇవాల్టికి ఇల్లంతా స్వయంగా నేనే సర్దాను. ముఖ్యంగా సుధ గదిని బాగా అలంకరించాను. మొన్నీమధ్యనే రెండు చిన్న కార్పెట్లు కొన్నాను. వాటిమీద మ్యాట్రిన్ స్వీట్స్ — రాబిట్ బొమ్మలు వున్నాయి. ఒకటి మధుకి. ఇంకోటి సుధకి. సుధ గదిలో అది పరిచాను. మధుది దాచివుంచాను. టేబిల్‌మీద పిల్లలబొమ్మ వున్న మాటీ టేబిల్ క్లాత్ పరిచాను. దానిమీద సుధ మనసుపడి కొనుక్కొన్న చేప ఆకారంలో వున్న ఫ్లవర్‌వాజ్ పెట్టి దాంట్లో రంగురంగుల పువ్వులు అమర్చాను. టేబిల్ పక్కగా వున్న కిటికీలో పుస్తకాల రాక్ ఒకటి చాలా ముద్దుగ వున్నది పెట్టాను. దాంట్లో కొత్తగా దానికోసం కొన్న బొమ్మల పుస్తకాలన్నీ పెట్టాను. గలివర్స్ ట్రావెల్స్, అల్లావుద్దీన్ అద్భుతదీపం, ఆలీబాబా నలభై దొంగలు — ఇట్లాంటివెన్నో వున్నాయి.

చదివేది పబ్లిక్ స్కూలులో అయినా తెలుగు కూడా బాగా వచ్చు దానికి. కథల పుస్తకాలు చక్కగా చదువుతుంది. పిల్లలకి మాతృభాష తప్పకుండా రావాలని నా ఉద్దేశం. అందుకే సెలవులలో ఇక్కడ వున్నన్నిరోజులూ నేను ఎక్కువగా దానిచేత తెలుగు పుస్తకాలు చదివిస్తూ వుంటాను. మధుకూడా ఇప్పుడిప్పుడే తెలుగు నేర్చుకుంటున్నాడు.

అద్దాల బీరువాలో అప్పటికే రకరకాల బొమ్మలు అమర్చివున్నాయి. కొత్తగా తీసుకున్న బొమ్మల్ని కూడా అందులో చేర్చాను. మధుకోసం కొన్నాను క్రికెట్ బాటూ — బాలూను. సుధచేత అవి పంపించా'.

ఇంకా ఏమిటబ్బా మర్చిపోయాను? ఆ! కర్టెన్లు! టేబిల్ క్లాతుకు మాచ్ అయ్యే — అవే పిల్లల బొమ్మలున్న కర్టెన్లు కొన్నాను. కర్టెన్లు తలుపులకి వేశాక — తృప్తిగా నా సుధ గది వేపొకమారు పరిశీలనగా చూశాను.

చాలా ముద్దుగా ముచ్చటగా వుంది! సుధ పడుకోడంమటుకు నాదగ్గరే! వాళ్లకి వంటరిగా పడుకోడం అలవాటేఅయినా నేనే వాళ్లని నాదగ్గర పడుకోబెట్టుకుంటాను. వాళ్లున్నన్నాళ్లూను. లేకపోతే నాకు తోచదు. వాళ్లున్నన్నిరోజులూ వాళ్లని నేను అంటిపెట్టుకునే వుండాలి. వాళ్ళు నా ప్రాణాలు!

అదే నాకు జీవితంలో తృప్తి!

వంట గదిలో కొచ్చాను. వంటంతా అయిపోయింది. పాలకోవా నేను స్వయంగా చెయ్యాలని చెప్పాను వంట మనిషి భాగ్యమ్మగారికి. అన్నీ నాకోసం రెడీగా అమర్చిపెట్టింది.

గ్యాస్ స్టౌ పరిశుభ్రంగా కడిగి వుంచింది. పెద్ద స్టీలుగిన్నెలో పాలు. పక్కనే కళాయిగిన్నె ఖాళీది. పంచదారడబ్బా, అట్లకాడ, పెద్ద కంచం.

అన్నీ సిద్ధంగా వున్నాయి. పాలకోవా చెయ్యడం ముగించాను.

హఠాత్తుగా గుర్తుకొచ్చింది — సుధకి ఫ్రూట్‌సలాడ్ అంటే చాలా ఇష్టం అని! "ఫ్రిజ్" తెరిచాను. ద్రాక్ష, ఆపిల్, అరటిపండ్లు, జామపండ్లు అన్నీ వున్నాయి. గబగబా కోసి పావుగంటలో ఫ్రూట్‌సలాడ్ చెయ్యడం ముగించాను. దాంట్లో కస్టర్డు కూడా వేశాను.

ఇంకా చెయ్యాల్సినవి ఏమిటి?


డి.రామానాయుడు
సమర్పించు

సురేష్ ఎంటర్‌ప్రైజెస్
మొరటోడు
నిర్మాత: సురేష్ బాబు
దర్శకత్వం: నాగేష్
ఆంధ్ర-సీడెడ్: నవయుగ
నైజాం
విజయ సురేష్ పిక్చర్స్
-ఈస్ట్‌మన్ కలర్

వేణ్ణీళ్ళు రెడీగా వున్నాయి. సుధ వేసుకోవాల్సిన గుడ్డల దగ్గిర్నించి సిద్ధంగా పెట్టాను.

వచ్చి గేట్లో నిలబడ్డాను. రాజన్నయ్య వెళ్ళి చాలాసేపయింది. రైలు లేటేమో!

చూసి చూసి విసుగొచ్చింది. వరండాలోనే పడక్కుర్చీలో కూర్చున్నాను.

వెనక్కివాలి కళ్ళు మూసుకున్నాను.

సంవత్సరమయింది సుధని చూసి.

కిందటి సెలవల్లో వాళ్ళ నాన్న దగ్గిరికి వెళ్ళిందది.

మధు నాదగ్గిరున్నాడు. వాడు చిలిపివాడు. దుడుకువెధవ! వున్నన్నిరోజులూ ఒకటే అల్లరి. ప్రతిరోజూ ఏదో ఒక జట్టీ తెచ్చేవాడు. చిలిపికృష్ణుడే అక్షరాలా!

సుధ స్వభావం అందుకు పూర్తిగా వ్యతిరేకం. నన్నంటిపెట్టుకునే వుంటుందెప్పుడూ. నేను కాస్త నలతగా వున్నా చూడలేదు. ఎన్నెప్పుడూ ఒంటరిగా వుండనీదు. ఎక్కడికో అక్కడికి వెళ్ళాల్సిందే ప్రతి సాయంత్రం! స్కూలు కబుర్లన్నీ చెప్తుంది. తను నేర్చుకున్న పాటలన్నీ పాడి వినిపిస్తుంది. ఇప్పుడిప్పుడే డాన్సు కూడా నేర్చుకుంటోందని. స్కూల్లోనే నేర్పిస్తారుట డాన్సు. మ్యూజిక్ కూడా! వీణ కూడా నేర్చుకోవాలని వుందిట. నెమ్మదిగా అదికూడా నేర్పుతానన్నారుట వాళ్ళ టీచరు. ఆ విషయాలన్నీ చెప్తూ వుంటుంది.

ఈసారి స్కూల్ మాగజీన్‌లో చిన్న చిన్న ఇంగ్లీషు పద్యాలు రాసిందిట. అంతా తండ్రి పోలిక.

అప్రయత్నంగా కన్నీళ్ళు వచ్చాయి నాకు. పమిటచెంగుతో అద్దుకుని తోటలోకి నడిచాను. గార్డెనింగ్ అంటే పిల్లలిద్దరికీ ఇష్టమే. నాకు ప్రాణం. అదే నాకు కాలక్షేపం. పిల్లలు దగ్గిర లేనప్పుడు! మొన్న సెలవుల్లో వచ్చినప్పుడు మధు జామచెట్టు వెయ్యమని గోలచేసి వేయించాడు. కాయ ఎప్పటికి వచ్చేను?

సుధ కిందటిసారి వచ్చినప్పుడు గులాబీతోట వెయ్యమని కోరింది. అన్నిరకాలూ డబ్బిచ్చి తెప్పించి వేయించాను. అన్నీ మొగ్గలుతొడిగాయి. విచ్చుతే రకరకాల పూలతో శోభ లొలుకుతుంది గులాబీ తోటంతా!

అదుగో కారు శబ్దం! సుధదేనా—? గబగబా వస్తున్నాను తోటనించి, చెంగున దూకింది నా ముద్దుల సుధ. ఎర్రని నైలెక్స్ గౌనులో వుంది. బాబ్డ్ హెయిర్! కొద్దిగా పొడుగయింది. అసలే సన్నగా వుండే పిల్ల ఇంకా సన్నగా వుంది. ప్రయాణ బడలికలో వాడిపోయినట్లుంది మొహం. అయినా కళ్ళు చురుగ్గా మెరుస్తున్నాయి.

"మమ్మీ..." పరుగెత్తుకువచ్చి నన్ను కావలించుకుంది. "తల్లీ సుధా..."

తల నిమిరి ముద్దు పెట్టుకున్నాను నేను హృదయానికి హత్తుకుంటూ.

"అమ్మా — నువ్వెట్లా వున్నావు? ఆరోగ్యం బావుందా?" అడిగింది దూరంగా జరిగి.

## రాగమాలిక

"నాకేమమ్మా బానే వున్నాను. నువ్వెట్లా వున్నావు? తమ్ముడెట్లా వున్నాడు?"

"అమ్మా — తమ్ముడు ఈసారి ఇక్కడికే వస్తానని ఏడిచాడు. కానీ నాన్న పంపించినాయన రానీలేదు. అయినా పేరు ముందే ఆ పార్టీలో వేశాయిగా? అమ్మా, నాన్నే ఆయనకిచ్చి నాకు బ్యూటిఫుల్ గౌను పంపించారమ్మా — ఎంత బావుందో అది —" కళ్ళు గుండ్రంగా తిప్పుతూ ముద్దుగా మాట్లాడుతున్న సుధని ఎంతసేపు చూసినా నాకు తనివితీరడంలేదు. దీన్ని సంవత్సరం పాటు విడిచి ఎట్లా వుండగలిగాను? అనిపిస్తోంది. అంతలోనే మధు రాలేదంటే విచారంగా వుంది.

"ఏమే మంజూ — మీ కబుర్లు తెగేలా లేవే

### నా సమరం ఆగిపోదు

ఈ తమస్సుతో పోరాడాలనే
ఓ చిన్ని దివ్వె వెలిగించాను
ఈ తిమిరం తొలగాలనే
ఓ చిన్ని కాంతి [illegible]
రాళ్ళబా[illegible]లకి
ఈ వెలుగే ఆధారం;
ముళ్ళబాటలో దప్పికగొంటే
ఈ కాంతే కాసారం!
ఈ దీపం కొడిగట్టిపోదని
నా శ్రమ ఏదీ వృధా పోదనీ
పగటి కలలు కంటూ కంటూ
కళ్ళు మూసి ఓసారి కునికాను!
ఈ ప్రళయకాల పవనాలేమిటి
ఉధృతాలై విసిరాయి!
ఈ రాక్షస శలభాలేమిటి?
కాంతిరేఖనే కబళించాయి!
ఈ తిమిరం వీడిపోదు
అంచేత — నా సమరం ఆగిపోదు!!

— ఎమ్. డి. సౌజన్య

నాకు ఆకలి దంచేస్తోంది" అన్న అన్నయ్య మాటలతో ఈ లోకంలోకి వచ్చాను.

"అమ్మా, నాకూ ఆకలేస్తోంది" సుధ అంది.

అందరం లోపలికి నడిచాం.

సుధ తన రూముని చూసి సంబరపడిపోయింది.

"ఈ కార్పెట్ చాలా బావుందమ్మా అబ్బ! ఈ బొమ్మ లెంతబావున్నాయో! కీ ఇస్తే ఊగుతుందామ్మా ఈ గుర్రం? ఇట్లాంటిది మా ఫ్రెండ్ రమక్కూడా వుందిట. ఇవి భలే మంచి బుక్స్ అమ్మా! ఎక్కడ కొన్నావు?" అంటూ సంభ్రమంగా గదంతా కలియతిరుగుతోంది సుధ.

"సరేలే. పద స్నానం చెయ్యొద్దూ? అన్నీ తరవాత చూసుకుందువుగాని." చెయ్యి పట్టుకుని తీసికెళ్ళాను బాత్‌రూమ్‌లోకి.

డెట్టాల్ వేసిన వేడివేడి నీళ్లతో, ఉడుకులోన్ సబ్బుతో స్నానంచేసి వచ్చిన సుధకి ఇష్టమైన పదార్థాలలో నా చేతులారా అన్నం కలిపి నోట్లో పెట్టాను.

అన్నం తింటూ ఏవేవో చెప్తూనేవుంది సుధ.

అన్నయ్య, నేనూ వింటూ వున్నాం. ఆ తరువాత — నా పక్కలో పడుకుని ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్తున్న సుధనే చూస్తూ పడుకున్నాను నేనుకూడా.

నా సంగతి తెలిసిన అన్నయ్య నన్నేమీ పలకరించలేదు. అన్నయ్య వుండేది బెజవాడలో వదిన పురిటికి వెళ్ళడంవలన తరుచుగా ఇక్కడికొచ్చి నాదగ్గిరే వుంటాడు. వదిన వున్నప్పుడుకూడా నా బాగోగులు చూసుకునే బాధ్యత అన్నయ్యదే కాబట్టి వారానికి పదిరోజులకీ వస్తూ వుంటాడు. పిల్లల్ని రైలెక్కించడం — మళ్ళీ తీసుకురావడం కూడా వాడే చేస్తూ వుంటాడు.

సుధ అలసటవల్ల నిదపోయింది.

నేను ఆలోచిస్తూ ఇంటి కప్పుకేసి చూస్తూ పడుకున్నాను.

"మంజూ" అన్నయ్య వచ్చాడు గదిలోకి.

"ఏంరా" నేను లేచి కూచున్నాను.

"ఏంలేదు. వరండాలో కూచుందామే. నాకూ ఏం తోచడంలేదు." అన్నాడు.

నేను మౌనంగా వరండాలోకి నడిచాను.

ఇద్దరం కుర్చీల్లో కూచున్నాం.

నేనే కల్పించుకుని అన్నాను. "ఏంరా. వదిన సంగతా? ఏం భయంలేదు. అంతా తేలిగ్గా జరిగిపోతుంది. ఇంకో వారంలో నాకు పండులాంటి మేనల్లుణ్ణి యిస్తుంది చూడు" వాణ్ణి ఉత్సాహపరుస్తూ నవ్వాను.

"కాదే అదికాదు. నీ సంగతే... సుధ పెరిగినకొద్దీ బావలాగా లేదూ? అసలూ బావ... మంచివాడేనే... ఎందుకట్లా చేశాడో కానీ... నువ్వంటే ఎంతో ప్రేమగా వుండేవాడుకదా?!"

"అన్నయ్యా..." కటువుగా అన్నాను.

ఆగిపోయాడు.

"వద్దురా. ఆ సంగతులు చెప్పి నన్ను బాధించద్దు. 'గతం నాస్తి' భవిష్యత్తులో బతుకుతాను నేను."

"... ... ... ..."

"మానిపోతున్న పుండును కెలికి నన్ను — నన్ను..." ఇంక మాట్లాడనివ్వలేదు నా కన్నీరు.

**2**

"అమ్మా..."

సుధ పిలుస్తూ వచ్చింది వంటింట్లోకి.

"నువ్వొద్దమ్మా — ఆంటీకే నేర్పు ఎట్లా చెయ్యాలో అన్నీ? ఎప్పుడూ వంటింట్లోనే వుంటే నాకు కంపెనీ ఎవరమ్మా? నాకేమో బోరు కొడుతోందిక్కడ. మామూలురోజుల్లో కాలేజీకి వెళ్తావు. ఇక ఆదివారాలన్నా నాతో గడపరాదా ఏం? ఎంతసేపూ పుస్తకాలు చదువుకోవాలి నేను. లేకపోతే మధూ, నేను ఒక్కచోట వుండేలా అన్నా అరేంజి చెయ్యి."

బుంగమూతి పెడుతూ అంది సుధ.

నా మనస్సు కలుక్కుమంది !

ఒక్క నిమిషమే అది. నా ముఖంలో భావాలు కనబడనీయకుండా చిరునవ్వు నవ్వాను నేను.

వంటావిణ్ణి 'ఆంటీ' అంటుంది సుధ.

ఇంట్లో మనిషిలాగా 'కలిసిపోయిన' ఆవిణ్ణి నేనుకూడా పరాయి మనిషిగా భావించను.

ఆవిడకి చెయ్యాల్సినవన్నీ చెప్పి, మూతి ముడుచుకు నుంచున్న సుధతో —

"పదమ్మా ! బాడ్మింటన్ ఆడుదామా?" అంటూ — దాని చెయ్యి పట్టుకుని బయటికి తీసుకొచ్చాను. మా కాలేజీలో యూనివర్సిటీ పరీక్షలు జరుగుతున్నాయి. అవయ్యాకగానీ సెలవులులేవు. నేను ఇన్విజిలేటరుగా వెళ్ళాలి. తప్పదు. తరవాత ఇంకొక్క నెలలో సుధ వెళ్ళిపోతుంది. నా పిల్లలున్న రోజుల్లో ప్రతిబంధకంగా వున్న కాలేజీ వాళ్ళు లేనప్పుడు నాకు స్వర్గంగా వుంటుంది. అదే ఒక లోకంగా వుంటుంది.

బాడ్మింటన్ ఛాంపియన్ని నేను. నేను చదువుకునే రోజుల్లో. పెద్దయితే సుధ నన్ను మించేటట్లుంది చూస్తే. ఇప్పుడే చాలా బాగా ఆడుతోంది. అట్లా ఇద్దరం ఎంతసేపు ఆడామో ! నాకు అలసట వచ్చింది.

"సుధా ! ఎండ యెక్కువవుతోంది. లోపలికెళ్దాం. మళ్ళీ రేపు." అన్నాను నేను చెమట అద్దుకుంటూ.

"సాయంత్రం నెహ్రూ జూలాజికల్ పార్కుకి వెళ్దామంటేనే నేను లోపలికి వస్తా." సుధపంతం.

"ఎన్నిసార్లు చూస్తావే అది ?" విసుగ్గా అడిగాను.

అదేం గమనించకుండానే —

"ఎప్పుడూలాగాకాదు. ఈసారి మేము కొన్ని జంతువుల గురించి మా పాఠంలో చదివాం. అందుకని మళ్ళీ చూడాలి."

అంది సుధ,

"సరేలే — పద." ఔననక తప్పలేదు నాకు.

సంతోషంగా లోపలికి పరుగుతీసింది.

దాన్నట్లాగే చూస్తూ నిలుచుండిపోయాను.

* * *

ఆ సాయంత్రం —

నేను వేసుకోవాల్సిన బట్టలు అదే సెలెక్ట్ చేసింది. ముదురునీలం ఫారిన్ నైలెక్స్ చీర మీద బనారస్ జరీ అంచు అటాచ్ చేసివుంది అదే కలర్ జాకెట్.

నేనది చూసి మాటరాక నిలిచిపోయాను. ఎక్కడో పెట్టెకి అడుగున పడేశానా చీర. పదేళ్ళనాటిది. వాళ్ళ నాన్న స్వయంగా కొన్నారా చీర. బలవంతంచేసి కట్టించారు నాచేత. బ్లూ కలరంటే ఆయనకి చెప్పలేనంత ఇష్టం. ఆయనవల్లనే నాకూ అదంటే ఇష్టం ఏర్పడింది. సుధ అక్షరాలా తండ్రి పోలికే! పోలికల్లో అలవాట్లల్లోకూడా !

వద్దంటున్నా ముట్టుముడుతున్నాయి ఆలోచనలు.

"వద్దమ్మా సుధా ! ఆ చీరొద్దు. ఇదిగో ఈ పట్టుచీర కట్టుకుంటాను. ఈ చీర నువ్వు చూడలేదుకదూ ? మొన్ననే కొన్నాను. రెడ్ కలరంటే నీకూ ఇష్టంగా ? ఇది కట్టుకోనా ?" అనునయంగా అడిగాను.

"ఊహూం! నువ్విదే కట్టుకోవాలి. ఈ చీర నువ్వు కట్టుకుంటే చాలా బావుంటుంది... ఎప్పుడూ ఇది కట్టుకో నువ్వు." మారాంచేసింది.

నేను దాన్ని లక్ష్యపెట్టకుండా ఆ చీర చుట్టచుట్టి పెట్లోకి విసిరేశాను. అది కట్టుకుంటే నాకు మనసులో చెయ్యిపెట్టి దేవుతున్నట్టుగా వుంటుంది బాధ.

సుధ పెద్దగా ఏడుస్తూ తన గదిలోకి వెళ్ళిపోయి తలుపులు బిగించుకుంది. ఎంతగా బతిమాలుకున్నా తలుపు తీయలేదు.

సుధ — నా చిట్టితల్లి. సుధ కళ్ళనీళ్ళు పెట్టుకుంటే నేను సహించలేను. నా మనసు ఊరుకోలేదు. నీరసంగా లేచి నీలం చీరే కట్టుకున్నాను.

సుధ గది కిటికీ దగ్గిరికి వెళ్ళి మాట్లాడకుండా నుంచున్నాను — దానికి కనబడేలాగ.

పక్కమీద పడుకునివుంది సుధ.

ఏడ్చి ఏడ్చి కళ్ళు, మొహంకూడా ఎర్రబడ్డాయి.

చీరెని చూడడంగానే దాని కళ్ళు మెరిశాయి. మొహాన చిరునవ్వు వెలిగింది.

తలుపుతీసి గబగబా పరుగెత్తుకొచ్చి—

"మా అమ్మ చాలా మంచిది." అంటూ బుగ్గమీద ముద్దుపెట్టుకుంది.

తనూ రెడీ అవడానికి బాత్రూమ్లోకి పరుగెత్తింది. పది నిమిషాల్లో రెడీఅయి వచ్చింది.

ఆ గౌను వాళ్ళ నాన్న పంపించిందే. పాలనురుగులాంటి తెల్లటి గౌను. మోచేతులదాకా స్లీవ్సు. చేతులకీ — మెడకీకూడా కుచ్చెళ్ళు. గౌనంతా ఖరీదైన ఎంబ్రాయిడరీ వర్క్తో వుంది. ఆ గౌనులో సుధ అందాలబొమ్మలా మెరిసిపోతోంది. దిష్టితగిలేటట్లు వుంది.

"అమ్మా ! నా గౌను బావుందికదూ ?" అడిగింది.

"అవునమ్మా ! చాలా బావుంది." అన్నాను నేను.

పార్కులో సుధ వున్నంత ఉషారుగా నేనెట్లా వుండగలను ? ఆ చీరలో — నేనున్నప్పుడు... గడిచిన స్మృతులు పదే పదే గుర్తుకువస్తున్నాయి. తల విపరీతంగా నెప్పిగా వుంది. అయినా సుధ కోసం తిరగక తప్పలేదు నాకు.

సుధ ప్రతిదీ వివరంగా తరచి తరచి చూసింది. వాటిల్లో కొన్నిటిని గురించి నాకు వివరించి చెప్పింది. కొన్ని పుస్తకంలో నోట్ చేసుకుంది. దానికి వున్న శ్రద్ధకి నిజంగా నాకు చాలా ముచ్చటేసింది.

అన్నీ చూడడానికి టైమ్ లేకపోయింది. ఇంటికి వచ్చేటప్పటికే చాలా పొద్దుపోయింది.

'ఇంకోసారి మళ్ళీ తీసికెళ్తాను' అంటేగాని నన్ను వదల్లేదు సుధ.

ఇంటికి వచ్చాక నేను మాట్లాడకుండా పడుకున్నాను.

"అమ్మా ! ఎందుకట్లా వున్నావు ? నేను పట్టుచీరె కట్టుకోనీలేదని కోపమా నామీద ?" బిక్కమొహంతో అడుగుతున్న సుధని చూస్తే జాలేసింది నాకు.

"లేదమ్మా ! నీమీద నాకు కోపమా ? లేదు తల్లీ. నాకు కొంచెం తలనొప్పిగా వుంది అంతే. ఇంకేంలేదు."

ఇంకా అట్లాగే చూస్తూ నుంచున్న సుధతో "పోనమ్మా ! పోయి అన్నంతినిరా." అన్నాను మళ్ళీ.

"నువ్వో ?"

"నాకు ఆకలిగాలేదు. నేను తరవాత తింటాలే. నువ్వు వెళ్ళి తినిరా."

సుధ కదల్లేదు.

"నీకు నామీద కోపమే. నాకు తెలుసు. లేకపోతే అన్నంతినకుండా ఎప్పుడన్నా పడుకున్నావా? ఈ టైములో అసలు పడుకోవు నువ్వు."

నాకు నవ్వు వచ్చింది.

"నాకు కోపం ఏమీలేదు. నీమీద అసలు రాదు. సరేనా ? మా అమ్మవికదూ ? పో — అన్నం తినిరా. ఏదీ — వన్ — టూ — త్రీ. వెళ్ళాలి మరి !"

వెళ్ళింది సుధ.

నాకు కాస్త నిద్రపట్టింది. నిద్రలో కల. ఆయన, మధు, సుధ. కొండమీదికి ఎక్కుతున్నారు. పిల్లలు కేరింతలు కొడుతున్నారు. ఆయన నవ్వుతున్నారు. పక్కన పెద్ద అగాధం. నేను వెనకే వెళ్ళి సుధని దగ్గిరికి తీసుకుని ఆయనతో ఏదో చెప్పబోయాను. ఆయన వినదల్చుకోనట్టు నా చేతుల్లోంచి సుధని లాక్కుని — నన్ను బలంగా ఒక్కతోపు తోశారు. నేను అగాధంలోకి పడిపోతున్నాను. పట్టేమీ చిక్కడంలేదు. నన్ను చూసి ఎవరో వికటాట్టహాసం చేస్తున్నారు.

"అమ్మా, సుధా !" గట్టిగా కేకవేసి పడిపోయాను.

"అమ్మా — అమ్మా !" సుధ పిలుస్తోంది-నన్నే.

నేను చావలేదా ?

"నా తల్లీ ! నేను పైకి రాలేనమ్మా." నేను వెక్కి వెక్కి ఏడుస్తున్నాను.

"మమ్మీ ! ఏం జరిగింది మమ్మీ !" సుధ నన్ను కుదుపుతోంది.

హఠాత్తుగా కళ్ళు తెరిచాను.

కలేనా ? అంతా కలేనా ? ఏదో హాయి నన్నావరించింది.

ఎదురుగా వున్న నా సుధని అక్కున చేర్చుకున్నాను.

"నువ్వు నా జీవిత సుధవేనమ్మా."

"అమ్మా ! అన్నం తినవూ ?"

చాలాసేపయాక అడిగింది సుధ.

అప్పుడు చూశాను. నాకోసం ప్లేటులో అన్నీ వడ్డించి గదిలోకే తీసుకొచ్చింది అన్నం.

'నేనంటే ఎందుకంత ఆపేక్ష నీకు ? అవును. నువ్వు నా కన్నకూతురివి.' నాలో నేనే అనుకున్నాను.

అన్నం తిన్నాక నా తలకి అమృతాంజనం రుద్దుతూ కూచున్న సుధని నేను వారించలేదు.

హాయిగా నిశ్చింతగా నిద్రపోయానా రాత్రి.

**3**

ఇంక సుధ సెలవులు పదిహేనురోజులే వున్నాయి. సుధ వెళ్ళిపోతుంది అనుకుంటేనే నాకు చాలా బాధగా వుంది.

## రాగమాలిక

వంటరితనం విసుగెత్తిస్తోంది. విరక్తి కలిగిస్తోంది.

నేనూ సుధ పొద్దున కాఫీ తాగి హాల్లో కూచున్నాం.

ఉదయభానుడు మెల్లి మెల్లిగా పైకి ఎగబాకుతున్నాడు. చెట్లమీదున్న మంచుబిందువులు సూర్యకిరణాల తాకిడికి కరిగిపోతున్నాయి.

కిటికీలోంచి ఈ దృశ్యాన్ని చూస్తూ కూచున్నాను నేను.

సుధ సోఫాలో కూచుని ఇంగ్లీషు చందమామ చదువుకుంటోంది.

అన్నయ్య వచ్చాడు బెజవాడనించి.

"మంజూ! నీకేం కావాలే?" అంటూ వచ్చాడు లోపలికి. సోఫాలో కూచున్న సుధని అమాంతం పైకెత్తి గిరగిరా తిప్పాడు.

కిలకిలా నవ్వింది.

ఈ ఉత్సాహానికి కారణం నాకు చూఛాయగా తెలిసింది.

"అన్నయ్యా! ప్లస్సా? మైనెస్సా?" అడిగాను.

"ప్లస్సే. నిన్న పొద్దునట. నాకు టెలిగ్రాం వచ్చింది. నాన్న పేరే ఖాయం. ఏమంటావు?" సంతోషం కళ్ళల్లో స్పష్టంగా కనబడుతోంది.

"శుభం. వదిన ఎట్లావుందిట?"

"ఇద్దరూ కులాసానే."

కుర్చీలో కూచున్నాడు.

కాఫీ తెచ్చిచ్చాను.

తాగుతూ "పద మంజూ! వెళ్దాం. మీ వదిన్ని చూసివద్దాం. సుధని చూడాలని ఎన్నోసార్లందికూడా తను." అన్నాడు.

"నువ్వు వెళ్ళిరా అన్నయ్యా! మేము బారసాలనాటికి వస్తాంగా. ఇంకా సుధకి కొనాల్సినవి చాలా వున్నాయి. అది వెళ్ళేరోజు దగ్గిర పడుతోందా?"

అన్నయ్య బలవంతం చెయ్యలేదు.

భోంచేసి తను మాత్రం వెళ్ళాడు.

నేను కాలేజీకి — ఇంటికి తప్ప ఎక్కడికీ — ఎవరిళ్ళకీ కదల్నని వాడికీ తెలుసు. పెళ్ళిళ్ళకీ — పేరంటాలకీ అసలే వెళ్ళను. నాదొరకమైన మనస్తత్వం. ఎవరిచేతా మాటపడను. అవమానం సహించను.

అన్నయ్యా, వదినా నన్ను చాలా బాగా చూసుకుంటారు. కానీ వాళ్ళవాళ్ళు చూసుకోవాలనేం రూల్సున్నాయి?

"అమ్మా! పబ్లిక్ గార్డెన్స్‌కి వెళ్ళాలి మనం సాయంత్రం!" గుర్తుచేసింది సుధ.

స్కర్ట్సు, బ్లవుజు వేసుకుంది.

'పెద్దదవుతోంది' అనుకున్నాను.

సాయంత్రం నేనే చీర కట్టుకున్నా ఊరుకుంటానంది సుధ. రక్షించింది అనుకున్నాను.

లాన్‌లో పరుగులు పెడుతూ ఆడుకుంటోంది. నేను జరిగిపోయిన సంఘటనన్ని గురించి ఆలోచిస్తూ కూచున్నాను.

ఇక్కడే... ఇక్కడే... నా జీవితంలో ముఖ్యమైన సంఘటన జరిగింది.

వద్దన్నా గుర్తుకువస్తుంటే నాకు విసుగు కలిగింది.

ఒక ఆంగ్లో ఇండియన్ జంట వచ్చారు షికారుగా. మాకు కాస్త దూరంలో కూచున్నారు. సుధని పలకరిస్తున్నారు. అది చక్కగా ఇంగ్లీషులో సమాధానం ఇస్తోంది.

కాసేపటికి 'ఐస్ క్రీం' తింటూ వచ్చి కూచుంది నాదగ్గిర. వాళ్ళిప్పిచ్చినట్లున్నారు.

"అమ్మా! ఆంటీ గూడా ఆవిడలాగా గౌను వేసుకుంటుంది."

నేనేం మాట్లాడలేదు. అది ఎవర్ని గురించి మాట్లాడుతోందో అర్థమైంది నాకు.

"నాకు ఆంటీ అంటే అసలిష్టంలేదు. నేను నాన్నతో ఆడుకుంటూవుంటానా. ఏదో పని వున్నట్లు నాన్నని లోపలికి పిలుస్తుంది. నాన్న వెళ్ళరులే. ఆవిణ్ణే కసురుతూవుంటారు."

అదే అంది మళ్ళీ.

నాకు కడుపులో మంట ప్రారంభమైంది.

"అసలు ఆంటీకి కూడా నేనంటే ఇష్టంలేదు. ఎందుకంటే ఆవిణ్ణి నేను — 'మమ్మీ' అని పిలవాలట. నేనెందుకు పిలుస్తాను? ఆవిడ నాకు మమ్మీనా? ఏమిటి? మధు పిలుస్తాడు. అందుకే వాడంటే ఇష్టం ఆవిడకి."

పెద్ద ఆరిందాలాగా మాట్లాడుతోంది.

"అమ్మా! నాన్న మంచివారమ్మా! నీగురించి ఎప్పుడూ అడుగుతూవుంటారమ్మా! కానీ ఆవిడ ఎదురుగుండా అడగరు. ఆవిడ వస్తే మాట మార్చేస్తారు"

"అమ్మా! నాన్న ఇక్కడికొస్తే బావుంటుంది కదూ? హాయిగా మధు ఇక్కడికే వస్తాడు. నాన్న — నువ్వు — మధూ — నేనూ అందరంకలిసి షికార్లకి, సినిమాలకి వెళ్ళచ్చు. ఆడుకోవచ్చు. కానీ, ఆంటీ రాగూడదు. ఆవిడసలు మంచిది కాదు." ఇంకా ఏదో చెప్పబోతోంది.

"నోర్ముయ్యి..." గట్టిగా అరిచాను.

ఎప్పుడూ కోప్పడని నేను అట్లా కసిరేటప్పటికి బిత్తరపోయింది సుధ.

"పద — ఇంటికెళ్దాం." గంభీరంగా అన్నాను.

పైకి ఏడవకుండా గుడ్లనీళ్ళు కుక్కుకుంటూ లేచింది సుధ.

ఆర్రాత్రి నిద్ర నాదగ్గిరికి రాలేదు.

ఎన్నాళ్ళిట్లా? పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు. చిన్నప్పుడు ఫరవాలేదు. ఇప్పుడు వాళ్ళనట్లా మాట్లాడకుండావుంచడం మన సాధ్యంకాదు. తండ్రి సంగతి నాదగ్గిర ఎత్తవద్దు. అంటే "ఎందుకు?" అని అడగరూ? తప్పకుండా అడుగుతారు. ఎందుకో చెప్తే అర్థంచేసుకోగలరా? లేదు. ఇప్పుడే అర్థంకాదు

---

విజయ నవ్వుకుంటూ శ్రీనివాస్ వున్న గదిలోకి వెళ్ళింది అతన్ని లేపేందుకు!

ఆఫీసుకయినా వెళ్ళకుండా పార్వతమ్మకోసం ఎదురుచూస్తూ డ్రాయింగ్ రూంలో కూర్చునివున్న రామనాథం ఏ చిన్నచప్పుడు వినిపించినా పార్వతమ్మ వస్తున్నట్టే భ్రమపడసాగాడు. ఆయన బాధల్లా శ్రీనివాస్ గురించే! ఈ ఆస్తిఅంతా విజయదేనని తెలుసుకున్న క్షణంలో కొడుకు ముఖభావాలు ఏవిధంగా మారేవి? అంతరంగంలో ఎలాంటి తుఫాన్ రేగేదీ అంతర్గతంగా ఊహించుకోసాగాడు. ఆనాడు జానికమ్మ యిచ్చిన బంగారాన్ని; డబ్బుని పార్వతితోపాటు తీసుకొచ్చి - వ్యాపారంలోపెట్టి లక్షలెట్లు అభివృద్ధి చేశాడు. అన్ని ఫరమ్సు జానికమ్మ పేరునే వుంచాడు. ఆ సంగతి ఒక్క పార్వతమ్మకి రామనాథానికి తప్ప మరెవ్వరికీ తెలియదు. ఆ నిజం తెలుసుకున్న శ్రీనివాస్ ఎలా మారుతాడు? ఏమనుకునివుంటాడు?

కారిడార్లో కారు ఆగిన చప్పుడవటంతో పార్వతమ్మ వచ్చివుంటుందనుకున్నాడు. మరో రెండు నిముషాలకి శ్రీనివాస్ విజయా లోపలికివచ్చి రామనాథం కాళ్ళకి నమస్కరించారు. పార్వతమ్మ ఆ ప్రక్కనే నిలబడి సంతృప్తిగా చూసుకోసాగింది.

రామనాథం తన కళ్ళని తాను నమ్మలేక

## రాగబంధం

[25వ పేజీ తరువాయి]

పోయాడు. కలా? నిజమా? అనుకున్నాడు. విజయ ఎక్కడికీ వెళ్ళకుండా తోటలోకి వెళ్ళిందని నిర్ధారణ చేసుకున్న రామనాథం కళ్ళు ఆశ్చర్యానందాలతో మెరిసిపోయాయి.

"నన్ను క్షమించండి డాడీ? చాలా తొందరపడి అలా ఉత్తరం వ్రాశాను!" అన్నాడు తల వంచుకుని చేతులు నులుపుకుంటూ;

"నిన్ను క్షమించవలసింది నేనుకాదు! మీ అమ్మకాదు! విజయను అడుగు! విజయ క్షమించితే మేమంతా క్షమించినట్టే!"

విజయవంక చూసి నవ్వాడు రామనాథం. విజయ శ్రీనివాస్ వంక చూసి నవ్వింది. బైటికి వచ్చిన శ్రీనివాస్‌తో భాస్కర్ అన్నాడు —

"మొత్తంమీద విజయ నీ ముక్కుకి తాడువేసి లాక్కువచ్చింది. విత్ బెస్ట్ విషెస్ మై హార్టీ కంగ్రాట్యులేషన్స్!"

"నన్ను క్షమించు అన్నయ్యా!"

"క్షమించటానికేమున్నది తమ్ముడా? మానవత్వంవున్న, మనిషిగా మార్చిన విజయను అభినందించాలి! ఏమ్మా విజయా!"

అన్నాడు భాస్కర్ విజయవంక చూసి నవ్వుతూ;

"ఫో పెదబావా!" అంటూ తన గదిలోకి తుర్రుమంది విజయ మెడలో పసుపుతాడు సరిచేసుకుంటూ.

(అయిపోయింది)

### అంకితం

నా ప్రతి రచననూ చదివి తన అమూల్యాభిప్రాయాన్ని యిస్తూ తనకి నచ్చని అంశాన్ని నిర్మొహమాటంగా వెల్లడించి; ఎప్పుడో వదిలివేసిన కలాన్ని బలవంతంగా పట్టించి వ్రాయించిన నా ఈ పదవ నవల మా అనుబంధానికి రాగబంధానికి చిహ్నంగా నా రామచంద్రరావుకి

ప్రేమతో
**సరోజినీదేవి**

వాళ్ళకి. ఈ సమస్య నాకేనా ? ఆయనకి లేదూ? ఆయనకేం అన్నీ మరిపించేవారున్నారుగా ?

మనసు కలతబారిపోయింది.

ఆలోచనల్ని పార(దోలడానికి 'వెండెట్టా' నవల చేతిలోకి తీసుకున్నాను.

అందులోని నాయిక డబ్బుకోసం—ధనంకోసం ఎంతమంది (ప్రియుల్ని మారుస్తుంది ! కాని —

## రా గ మా లి క

నిజానికి అట్లాంటి ఆడవాళ్ళు మన సంఘంలో ఎక్కడోకాని కానరారు. మగవాళ్ళు లేరూ ? వున్నారు. భార్యల్ని మార్చేవారు — వదిలేసేవాళ్ళూ వున్నారు. కానీ, డబ్బుకోసం భార్యల్ని వదిలేయరు వాళ్ళు. (పేమ — మోహం — ఫేషన్ — ధర్మం అనే గంతలు కళ్ళకి కట్టుకుని భార్యల్ని వదిలేస్తారు.

వాళ్ళ మనసు — మమత వీళ్ళకి అక్కర్లేదు. అందుకు — ఇదిగో నా జీవితమే నిదర్శనం.

ఏ ఆలోచనల్ని పోగొట్టుకోడానికి పుస్తకం పట్టుకున్నానో అవి నన్ను వదలలేదు.

సరికదా ఇంకా ఎక్కువయ్యాయి.

[ ఇంకా వుంది ]

# వారఫలం

—మహేష్—

**30-12-1977 శుక్రవారం మొదలు**
**5-1-1978 గురువారం వరకు**

**మేషం,—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. సాటివారితో వాదప్రతివాదాలు తగవు. ప్రయోజనం గల వ్యక్తులను కలుసుకొంటారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

**వృషభం :—** స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసివస్తుంది. స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మిధునం :—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలుతగవు. మీకార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు.

**కర్కాటకం :—** మీ శ్రమకుతగిన ఫలితం లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగించగలదు.—స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**సింహం :—** వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. సాహసిక వ్యవహారాలు లాభించగలవు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన సమాచారం అందగలదు.

**కన్య :—** చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో ప్రయాణాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలులాభిస్తాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**తుల :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం ఆఖరులోమీ కార్యక్రమాలుతిరిగి బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లోఖ్యాతిలభిస్తుంది.

**వృశ్చికం :—** అధికారులవలనజరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**ధనుస్సు:—** మీకార్యక్రమాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభించగలవు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**మకరం:—** ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ఆందోళనకు గురికాగలరు. వారం మధ్యలో నూతన వ్యవహారాలు లాభిస్తాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వృత్తిలో ముఖ్యమైనవ్యక్తులనుకలుసుకొంటారు. స్త్రీలకు-కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**కుంభం:—** ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులోఅనుకూల పరిస్థితి ఏర్పడగలదు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. విలాస వస్తువులు కొంటారు.

**మీనం:—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలుబాగుంటాయి. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.



# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే ఇంధనాన్ని సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

రైలు మోస్తరుగానే మీకు కూడా ప్రతీ రోజు ఉత్సాహంగా. ప్రారంభించేందుకు ఇంధనం కావాలి. అందుచేతనే ప్రతీ ఉదయం మీరు బూస్ట్ సేవించాలి.

మీరు చకచకా పనులు చేసుకొనడంలో మీకు తోడ్పడే శక్తిదాయకమైన ఇంధనం. ముఖ్యంగా పనిలోను, ఆటల్లోను అదనంగా శక్తిని వెచ్చించే మీ పిల్లలకు ఇది కావాలి.

వారికి బూస్ట్ యివ్వండి. ఇది మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు. పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన "హార్లిక్స్" ఉత్పత్తిదారులు తయారు చేసింది.

సంపన్నమయిన క్రీమ్‌తో కూడిన బూస్ట్ మీకు మరింతగా శక్తినిస్తుంది. ఎందుచేతనంటే ఇది సంపూర్ణమయిన మీగడ పాలతోను, గోధుమతోను, బార్లీ మాల్ట్‌తోను, కోకోతోను తయారయింది.

బూస్ట్‌లో మీ పిల్లల పెరుగుదలకుగాను. ఇటువంటి మరే ఇతర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పౌష్టిక పదార్థాలు ఉన్నాయి.

అంతేకాదు. బూస్ట్‌కి. మీ కుటుంబమంతా కూడా యిష్టపడే క్రీమ్ మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన ఉన్నాయి. బూస్ట్, మీ రోజుని ప్రారంభించేందుకు ఖచ్చితమైన మార్గం—ప్రతీ రోజు.

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

B-4575-TEL-1

# పెళ్ళికోసం

మురాల రాఘవయ్య



*"ఏమిటలా చూస్తున్నావ్ దానివంక? త్రాగుతావా రోహిణి" రంగనాధ్ అడిగాడు*

*"లేదండీ కలోనల్ స్పెషల్ అని వుంటే చూస్తున్నా" చిన్నగా అంది రోహిణి.*

"అవును అది ఫారిన్ విస్కీ చాలా
రీడైంది. అది నా కలవాటు. శోభనం
దిలో పెట్టటం మంచిది కాదనుకో ఐనా
లవాటు ఏం చేస్తాం!" అంటూ ఆమెని
మీపించాడు రంగనాధ్

"ఫరవాలేదు లెండి ఎవరి అలవాట్లు
ారివి, బాధెందుకు?" బాధతో మూల్గి
ట్లు అంది రోహిణి.

"నీవు గూడా త్రాగుతావా రోహిణి"
ంగనాద్ ఎగతాళిగా నవ్వుతూ అన్నాడు.

"ఇప్పుడు కాదులెండి!" ముక్తసరిగా
ంది

ఉలిక్కిపడ్డాడు రంగనాద్. "ఏమిటి?
వ్వు త్రాగుతావా!?" యిల్లు అదిరిపోయే
ట్లు అరిచాడు. అతని కళ్ళు విప్పా
డ్డాయి.

"అది కాదండే – త్రాగుతావా? అంటే యిప్పుడు వద్దు అన్నాను. ఆ టేబుల్ మీద వున్న 'స్పెషల్,' బ్లాక్ నైట్' అంటే ఏమిటో నాకు తెలియలేదు; అయినా శోభనం గదిలో బాటిల్సు తెచ్చుకుని త్రాగే మీకు ఆడది త్రాగుతుందంటేనే హడలిపోవటం దేనికి?" నవ్వుతున్నట్లు నటించి మాట్లాడింది రోహిణి.

"అమ్మయ్య ఏమిటో నీకూ త్రాగటం అలవాటుందేమోనని ఖంగారు పడ్డాను" అంటూనే మంచం మీదికి వెళ్ళి కూర్చున్నాడు. ప్రక్కనే ఒక స్టూలు లాక్కుని కూర్చుంది రోహిణి

సిగరెట్టు ముట్టించి అలలు అలలుగా పొగ వదులుతున్నాడు రంగనాధ్

ఆ పొగవంక చూస్తూ ఆలోచిస్తూంది రోహిణి.

"సిగరెట్టు కాల్చుతావా నీవు కూడా" ముద్దుగా అన్నాడు రంగనాధ్.

"వద్దులెండి తరువాత మీ దగ్గర నేర్చుకుంటాను" క్రిందవంక చూస్తూనే అంది రోహిణి

"ఏమిటి రోహిణీ! యిందాక త్రాగుతావా అంటే యిప్పుడు కాదులెండి అన్నావు. సిగరెట్టు కాలుస్తావా అంటే నేర్చుకుంటాలెండి అంటున్నావు. నీవు ఆడదానివా లేక..." ఏదో అనబోయాడు.

"ఇక ఆపండి నేను ఆడదాన్నే సంస్కారంగల దాన్నే మీలాగా తెగించి శోభనం గదిలో విస్కీ సీసాలతో విలాసంగా వుండేదాన్ని మాత్రంకాదు. మీరు అంత గట్టిగా అరవనక్కరలేదు" గట్టిగా అంది రోహిణి.

"ఇప్పుడర్థమైంది, నీవు లోకానికి భయపడి లైసెన్సుకోసం నన్ను పెండ్లి

చేసుకున్నావన్న మాట" అని నిగ్గదీశాడు.

"లేదు నాకు లైసెన్సు అక్కరలేదు – చేసుకోవాలనుకునే మిమ్మల్ని కట్టుకున్నాను." రోహిణి విసుగ్గా అంది.

"అంటే నన్ను కట్టుకున్నావా ?" రంగనాథ్ పెద్దగా అన్నాడు.

"అవును మా నాన్న యిచ్చే కట్నం మీరు తీసుకోబట్టి మిమ్మల్ని నాకు కట్టబెట్టాడు."

"అయితే యింకా నీకు విద్యాసాగర్ మీద వ్యామోహం పోలేదన్నమాట –"

"అది మీ కనవసరం" రోహిణి వస్తున్న కోపాన్ని అణచుకుంటూ అంది.

"నీవు నా భార్యవు – నీ ప్రియుని వివరాలు నా కనవసరం అంటే ఎలా?" అదోలా ఎగతాళిగా అన్నాడు.

"లేనిపోని మాటలు మాట్లాడవద్దు సాగర్ నేను కాలేజీలో లెక్చరర్లుగా వున్నప్పుడు, ప్రేమించుకున్నాం పెండ్లి చేసుకోవాలనుకున్నాం అతనికి మిలటరీలో కమిషన్డ్ ఆఫీసరు సెలక్షను వచ్చింది వెళ్ళిపోయాడు. అనివార్య కారణాలచేత మా పెండ్లి ఆగిపోయింది. అందుచేత యీ పెళ్ళికి ఒప్పుకున్నాను. అంతే..."

"కాలేజీలో పనిచేసేటప్పుడు మీ యిద్దరు ఒక స్కూటరుమీద వెళ్లటం అంతా చూడటం, ఫొటోలు తీయించుకోడం అదీ అబద్ధమేనా" ఆమెవంక వ్యంగ్య ధోరణిలో చూశాడు.

"అది నిజమే ! అంతవరకే జరిగింది" అంటూ సంభాషణ త్రుంచివేసింది రోహిణి.

"ఈ లెటరు చూడండి! దేవీగారూ!" అంటూ కోపంగా ఒక లెటరు యిచ్చాడు- అది యిట్లా వుంది.

"విద్యా ! సినిమాలో, మనం ఒకమూలే వున్నాం అనుకో అలా బలవంతంగా యింగ్లీషు సినిమా పద్ధతి అనుకరించటం ఏమి బాగుండలేదు. పెళ్లిగాని తల్లిలా నన్ను చూడాలని వుందా – అలా అయితే నీ కోర్కె నెరవేరదు. తొందరపాటు తగదని హెచ్చరిస్తున్నాను."

ఇట్లు,
నీ రోహిణి

అదంతా చదివాక "అవును యీ వుత్తరం నేను రాసిందే; అంతకన్నా మా యిద్దరిమధ్యా ఏమీ లేదు." ధైర్యంగానే

# పెళ్ళి కోసం

చెప్పింది.

"ఆడదానివి అంతకంటె ఏమి లేదంటే యింకా ఏమిటి కావాలి చెప్పు" ఆమె గడ్డాన్ని పైకి లేపాడు, ఆమె అందాన్ని అవలోకగా చూచాడు. ఆమె అందంగానే వుంది.

"మీ అభిప్రాయం ఏమిటో తేల్చి చెప్పే వరకు నన్ను ముట్టుకోకండి" రోహిణి, శాసించినట్టు మాట్లాడింది.

"అవును. పెళ్లి కాకముందే అన్నీ అయిపోతే యింక నేను ముట్టుకోవటం దేనికిలే" పెద్దగా నవ్వాడు.

"శృతిమించి మాట్లాడకండి" రోహిణి బాధగా అంది.

## తేడా

జీవితం గులాబీపంట అని భ్రమించి
నపుడు
దారిపక్కన వున్న ఆ పిచ్చి గన్నేరు
పూవును
కను కొసల నించైనా చూసేదాన్ని
కాదు
తర్వాత–
జీవితం ముళ్లపొద అని తెలుసుకొని
ఆ పచ్చగన్నేరు పూవును
ఆ పిచ్చి గన్నేరు పూవునే
చేతులతో తీసుకొని తలలో పదిలంగా
ముడుచుకున్నాను

— యస్. రాజేశ్వరి

"ఈ లెటరు కూడా తిలకించండి దేవిగారు." అని మరో ఉత్తరం మొహాన కొట్టాడు.

"అమ్మానాన్న బయటకు వెళ్లారే అనుకోండి, అమాంతంగా మనిషి మీదకు రావటమేనా? అంతటితో ఆగక అదేమిటండీ ఛ.. తప్పుకాదూ.. ఆహా మీరింకా చెడిపోతారండి ఇంగ్లీషు పుస్తకాలు చదవటం ఆపివేయండి. లేదా ప్రమాదం"

"నేను మొదటనే చెప్పాను, సాగర్ నేను పెళ్లి చేసుకోవాలని అనుకున్నాం. కానీ యిలా బ్లాక్ మెయిల్ చేయటం మీకింక అనవసరం. మీరు చేసేది చేయండి,చెప్పేది చెప్పండి" రోహిణి అన్నది.

"అయితే నాకు విడాకులు వ్రాసియివ్వు" గద్దించాడు రంగనాథ్

"లేదు విడాకులు యివ్వనక్కరలేదు యిచ్చినట్లే; మీరు మీ దారిన వెళ్లండి మర్యాదగా" రోహిణి నిర్మొగమాటంగా చెప్పింది.

"ఇంక మర్యాదను గురించి మాట్లాడటం నీ కనవసరం" విసురుగా ఆ రాత్రికి రాత్రే వెళ్లిపోయాడు రంగనాథ్.

తలుపులు వేసుకుని మంచంమీద పడుకుని రోహిణి ఎంతగానో ఏడ్చింది. తెల్లవారింది.

రాత్రి జరిగిన గొడవలు చెప్పమంది తల్లి "ఏమిలేదు ఆయనకు సెలవు దొరకలేదు వెళ్లిపోయాడు" అని రోహిణి తల్లికిచ్చింది సమాధానం.

"తల్లికికూడా చెప్పనంత రహస్యమేమిటే" అంటూ ఆమె బలవంతం చేసింది.

"ఏమిలేదమ్మా ! నీవు బ్రతకవని డాక్టర్లు చెప్పినప్పుడు, నీ ఆఖరి కోరిక నా పెళ్లి అని నీవు చెబితే ఒప్పుకున్నాను. నిన్ను బ్రతికించుకున్నాను. కాని నీవిప్పుడు నన్ను చంపుతున్నావు" తల దిండులో దూర్చుకు ఏడ్వసాగింది రోహిణి.

ఆరు నెలలు గడిచింది రంగనాథ్ జాడ తెలియలేదు సాగర్ దగ్గరనుండి వుత్తరం వచ్చింది. హైదరాబాద్ విమానాశ్రయానికి రమ్మని. రోహిణికి వెళ్లాలని అనిపించలేదు. కాని మిలటరీ ఆఫీసరు అయికూడా వుత్తరాలు ఒకరికిచ్చి బ్లాక్‌మెయిల్ చేయించటం ఎంత నీచమో అతనికి తెలపాలని మొహాన నాలుగు అడగాలని వెళింది.

"ఇక్కడ మిలటరీ గెస్టుహౌస్ వుంది అక్కడ మాట్లాడుకుందాం పద" అన్నాడు సాగర్.

అల్లరి కాకుండా అతనిని నాలుగూ అడిగి వెళ్లిపోవాలని వెళ్లింది రోహిణి !

"ఏమిటి రోహిణీ అలా రోహిణీకార్తె ఎండలా మండిపోతున్నావ్ ?" ఆమె దగ్గరకు వెళ్లాడు.

"క్షమించాలి నేను వివాహితను" దూరంగా జరిగింది.

"తెలుసు" అతను యింకా చేరువయ్యాడు.

"దేశ సేవకులమని చెబుతూనే వుత్త

రాలు ద్వారా బ్లాక్‌మెయిల్ చేయటం ఎంత నీచమో గ్రహించారా?'' ఆపుకోలేని కోపంతో అంది రోహిణి.

''అదీ తెలుసు దేవీ!'' — ఆమెను తన బలం వుపయోగించి కౌగిలిలో బంధించబోయాడు.

''నన్ను వదలాలి. రాస్కెల్! ఏ పరిస్థితిలోను నేను నీకు లొంగను'' పెనుగులాడింది రోహిణి.

''రోహిణిని బలవంతంగా మంచం మీద పడవేసి లేవకుండా పట్టుకున్నాడు, సాగర్.

రోహిణీ యింక నేను దాచలేను. నేను వుద్యోగంచేస్తూ వుండగా ఒక ప్రమాదంలో వెన్ను వెనుక ప్రక్కన తుపాకి గుం చిక్కుకుంది దానివల్ల డాక్టర్లు నేను సంసార సుఖాలకు పనికిరానన్నారు. ఆ కారణంగా నీమీద వుండే విపరీతమైన ప్రేమతో నీ సుఖాన్ని కోరి వివాహం చేసుకోనన్నాను కాని నా ఆస్తిపాస్తులకు,నా తరువాత వారసురాలవు నీవేనని వ్రాసి యిచ్చాను. విదేశీ నిపుణుల ద్వారా మన ప్రభుత్వం నాకు ఆపరేషను చేయించింది. దానితో నాకు పూర్తి ఆరోగ్యం చేకూరింది. ఈలోపుగా మీ అమ్మ చావు బ్రతుకులమధ్య వుందని నీ పెళ్ళికి తొందర చేస్తోందని విని నాతో పనిచేసే రంగనాధ్‌ని ఒక పెద్ద ఉద్యోగిగా బొంబాయికి బదిలీ అయి వెడుతున్న నా ప్రాణ మిత్రుణ్ణి బ్రతిమాలాను. నా గాథ అంతా చెప్పాను. అతను నిన్ను తన చెలెలుగా భావించి నాకు అప్పచెప్పాడు. ఆ రంగనాధ్, త్రాగుబోతు కాదు, మహా బుద్ధిమంతుడు, మీ అమ్మ మాట, నా మాట దక్కించాడు అంతే... ఈ రోజే మనం రిజిష్టరు పెండ్లి చేసుకుందాం. ఇంక నిన్ను వదలి పోలేను'' తన గాథ అంతా వివరించాడు సాగర్.

''ఏదో లోపముందని నా కంత అన్యాయం చేయటం దేనికండీ. - మీ కనుసన్నలలో బ్రతికేదాన్నిగా. పోనీయండి నా దైవం నాకు దొరికాడు'' అతని గుండెలో తల దాచుకుంది.

''ఇప్పుడైనా నమ్మావా నీ కోసం, నీ అందంకోసం ఎంత బాధపడ్డానో'' ఆమె నుదిటుమీద ముద్దు పెట్టుకున్నాడు సాగర్ మమతగా...

''అవును పాపం పెండ్లికోసం చాలా పాట్లు పడ్డారు, అతనిని పెనవేసుకుపోయింది రోహిణి యిక ఉండబట్టలేక...

''అంటే పెళ్ళికోసమేగాని, నీ కోసం కాదన్నమాట'' ఆమె రెండు భుజాలు పట్టుకుని కళ్ళలోనికి చూశాడు లాలసగా.

'నాకోసమో కాదో మీరే చెప్పాలిమరి'' అని అతని వక్షస్థలంమీద వాలిపోయింది. పోనీలే రోహిణి ఇంక వాదనలెందుకు ఆమెను అతనిలో లీనం చేసుకున్నట్లు బంధించాడు.

# ప్రశ్నావళి * — కె. రామలక్ష్మి

**శంకర్ – బందరు**

అమ్మ బాబోయ్ నమ్మరాదు. మీ పగలవారి అమ్మాయిల నమ్మరాదు. డబ్బున్న అబ్బాయిలను టక్కున పట్టేస్తారు.

మీకెందుకా బెంగ? శంకరుడు విభూతి పూసుకొని తిరిగేవాడు. బందర్లో ధైర్యంగా తిరగండి.

**జి. యు. ఎస్. ఆర్ – బరంపురం**

మీ ఆడవారికి భర్తే దేవుడంటారు. అయినా గోపురాలకెళ్ళి కొబ్బరికాయలు కొట్టడం దేనికో?

ఆ భర్తలకి కాస్త ఇంగితం, కాస్త దక్షత, కాస్త మానవత, కాస్త ఔన్నత్యం, కించిత్ దయా గుణం హృదయ వైశాల్యం లాంటివి ప్రసాదిస్తే బాగుంటుందని — కోరుకోడానికై వుంటుంది రెడ్డిగారూ.

**బి. ఆర్. కె – మహబూబ్‌నగరు**

తమ అవసరాలను తీరుస్తున్నంత కాలం మంచిగా వుంటూ తీర్చలేనప్పుడు పోట్లాడుతూ వుండే పొరుగును ఏమనాలో తెలియజేస్తారా?

వారినెందుకేదో అనడం— మీ చేతకానితనాన్ని చక్కగా వినియోగించుకుంటున్న తెలివైనవాళ్ళు మీ పొరుగు వాళ్ళు. చూడండి, పొరుగును ప్రేమించు అన్నారే గాని, అతిగా ప్రేమించు అని అనలేదే. స్నేహం నిలవాలంటే మధ్య అవసరాలు రానివ్వకూడదు.

**ఎస్. – బసంత్‌నగరు**

మీ ప్రశ్నలు చదివి మా శ్రీవారు ఎప్పుడూ స్త్రీ జాతిని తిడతారు. అలాంటి ఘాటు జవాబులు ఎందుకు ఇస్తారు?

తీపి తీపిగా ఇస్తే తిట్టరనా? మీ వుద్దేశ్యం. అప్పుడూ అంటారు— చేతకాని జవాబులని! మీ వారు స్త్రీ జాతిని తిట్టినప్పుడు— మీరూ ఆ జాతి వారేనని జ్ఞాపకం చేస్తూ వుండండి.

**టి. కె. పి – నూజివీడు**

కొందరు భార్యలు భర్తలపై తిరుగబడుతున్నారంటే మీవంటి పురుష ద్వేషిణుల ఉపన్యాసాలే కారణం అంటాను. మీరేమంటారు?

మీ లాంటి సభ్యత తెలుగని మగవారి ప్రవర్తనే కారణం అని ఎందుకనుకోకూడదు అంటాను.

**ఎ. బి – విజయనగరం**

ఎవరైనా మిమ్మల్ని సలహా అడుగుతే పొగరుబోతు సమాధానాలు ఇస్తారు గాని అనుభవించి వాడికి తెలుస్తాది కష్టం నిష్ఠూరం.

అలాగ! ఆడదాన్ని గురించి మీరంతా వెలిబుచ్చే అభిప్రాయాలు సలహాలుగా పాటించే ఉదారత చచ్చిన మనుషులకి కూడా వుండదని నా అభిప్రాయం. ఇక సలహా అడిగితే పొగరుబోతుగా సమాధానం ఇచ్చే అవకాశం ఎలా వుంటుంది? ఉదాహరణకి చెయ్యి విరిగింది ఏం చెయ్యను? అంటే పుత్తూరు వెళ్ళండి! అనడం పొగరుబోతుతనం కాదే! అలాగే ఆడవాళ్ళెట్టి చచ్చు పీనుగులు ఏమంటారు? అని మీరంటే మీకంటేనా? అని ప్రశ్న వేయడం పొగరుబోత్తనంకాదే! ఇక, అనుభవంలో తెలిసే కష్ట నిష్ఠూరాలో— అక్కడికక్కడే— సమాధానం దొరికి పోతుంది. అవునా?!

**జగదీష్ – కర్నూలు**

మగవాడి బలహీనత ఆడదాని అధికారానికి ఆస్కారమిస్తూందేమో?

ఆడ — మగ మధ్య బలహీనత లేకపోతే — ఇహ సృష్టికే ఆధారం లేదు.

**సి. ఆర్. వి ఎమ్ – విజయవాడ**

ఒళ్ళు తెలియని కోపం వారికి. ఆ కోపంలో పిల్లల్ని కొడుతూంటే నాకే భయం వేస్తుంది... ఎలా చెప్పాలో తెలియడం లేదు.

కోపంలో శిక్షించడమే తప్పు. ఇలాంటి విషయాలు భార్యా భర్తలు కూర్చుని మాట్లాడుకో లేక పోవడమే, మధ్య తరగతి ఇబ్బాతిబాధలకి — పెద్ద కారణం.

**ఎస్. ఏ. ఆర్ – నిస్సంకోడేరు**

దారితప్పిన తండ్రి నవల చాలా బాగున్నది. అందుకు మీకు మా అభినందనలు. సీరియల్ ముగింపులో మీరు చిన్న అల్లిని మాత్రమే చూపారు. కాని అన్న పూర్ణమ్మ విడుదలై రావడం జైలు అధికారులు ఆమె శిక్ష తగ్గించడం, ఆమె ఇంటికి వచ్చి చిన్న అల్లిల అన్యోన్యత్వాన్నిచూసి తన బాధ మరచి పోవడం, హాయిగా శాంతంగా వున్నట్టు రాస్తే ఇంకా బాగుండేది.

శుభం చూపించలేదనేగా మీరనేది!! అక్కడితో తపక ఏ మాత్రం పొడిగించినా నవలలో టెన్షన్ సడలి పోతుందని నా నమ్మకం. అయినా అన్నపూర్ణమ్మ ఇంకో జన్మ ఎత్తినా తను చేసిన పని మరిచి పోతుందని నేను అనుకోను.

**పి. కె. వి – సికింద్రాబాదు**

చిన్న పిల్లలకి ఆదర్శవంతంగా వుండాలి. తల్లి. లేక పోతే వారు జులాయిలుగా తయారవుతారు.

చిన్న పిల్లలు ఒక్క తల్లి చుట్టూనే వుంటారా? చుట్టూ మనుషులుండరా? చిన్నతనం ఏ ఆదర్శం లేకుండా పరుగులు తీయవచ్చును కాని యువతకి ఏ ఆదర్శం వుండాలి. అది లేనప్పుడే— ప్రమాదం

**డి. వి. ఆర్ – హైదరాబాదు**

అన్నీ సమస్యలే అయితే ఇంక సాగేదెలా?

ప్రతి సమస్యా ఏ అవకాశం అనుకోవాలి. అలా అని ప్రతి అవకాశం సమస్య చేసుకొని తల బద్దలు కొట్టుకోకూడదు.

# హైద్రాబాద్ నోట్ బుక్

## మరి ఆరుగురు మంత్రులు రాజీనామా

రాష్ట్రంలో ఒక వైపు తుఫాను తాకిడితో సతమతమవుతున్న కోస్తా జిల్లాలకు తగిన సమయంలో తగినంత సహాయం అందలేదని ఒక వేపు పలువురు నాయకులు, రాజకీయపక్షాలు విమర్శిస్తున్నసమయంలో రాష్ట్రమంత్రి వర్గానికి కూడ ఈ తుఫానుతాకిడి కలిగింది. మరిఐదుగురు మంత్రులు శ్రీయుతులు పిడతల రంగారెడ్డి, చొక్కారావు, అంజయ్య, ధర్మారెడ్డి, అనంసంజీవరెడ్డి, నగరాభివృద్ధి సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి, తెలంగాణా ప్రాంతీయాభివృద్ధి సంఘాధ్యక్షుడు శ్రీ జగన్నాథరావు తుఫానుబాధితులకు సహాయం చేయడంలో మంత్రివర్గం విఫలమయిందనే కారణంగా డిసెంబర్ 1 వ తేదీన తమ పదవులకు రాజీనామా యిచ్చారు. వీరి రాజీనామాను గవర్నర్ ఆమోదించారు. ఎందరు మంత్రులు రాజీనామా చేసినా, విధాన సభలో తమ బలమున్నంతవరకు ప్రభుత్వానికి ఏమీ ఢోకా లేదని ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ప్రకటించారు. ముఖ్యమంత్రి రాజీనామా చేసిన మంత్రుల శాఖలను ఇతరులకు పంచారు. నగరాభివృద్ధి సంస్థ అధ్యక్షుడుగా విధానసభ సభ్యుడు శ్రీ నాగం కృష్ణను నియమించారు. తుఫాను సహాయ కార్యక్రమాల నిర్వహణ కోసం రాష్ట్ర ప్రభుత్వం శ్రీ బి. డి. నాయుడును ప్రత్యేక ప్రధాన కార్యదర్శిగా నియమించింది. ఈయన ప్రస్తుత ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. కృష్ణస్వామి పదవీ విరమణ తర్వాత ప్రధాన కార్యదర్శిగా వ్యవహరిస్తారు. సుప్రసిద్ధ సంఘ సేవకురాలు మదర్ థెరిసా తన బృందంతో తుఫాను బాధితుల సహాయం నిమిత్తం అవనిగడ్డకు బయలుదేరారు. రాజీనామా చేసిన మంత్రులు కూడ అవనిగడ్డకు వెళ్లారు.

## టిక్కెట్టుకొని నాటకం చూడాలని హితవు

నాలుగు సాంస్కృతిక సంస్థలు ఇండియన్ మెడివల్ థియేటర్, విజ్ఞాన కళాకేంద్రం పోతుకూచి ట్రూప్, ఇండియన్ నేషనల్ థియేటర్ల సంయుక్తాధ్వర్యంలో నవంబర్ చివరి వారంలో రవీంద్ర భారతిలో ప్రదర్శించిన కృష్ణతులాభారం నాటకం సందర్భంగా సన్మానితులైన రాష్ట్ర చలనచిత్రాభివృద్ధి సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ రాజారామ్‌దాస్ మంచి సలహా యిచ్చారు. తెలుగు ప్రేక్షకులు టికెట్లు కొని నాటకాలు చూచే అలవాటుచేసుకుంటేనే తెలుగు నాటక రంగం బాగు పడుతుందని నాటకాలు ఔత్సాహిక స్థాయినుండి వృత్తి స్థాయిని అందుకోవాలని ఆయన సూచించారు. ఈ సూచనను సహృదయులైన తెలుగు వారు మననం చేసుకోవాలి. ఈ నాలుగు సంస్థలూ సమాఖ్యగా ఏర్పడి! తెలుగు నాటక రంగాన్ని సముద్ధరించదలచాయి. ఈ సమాఖ్యకు డాక్టర్ మర్రి చెన్నారెడ్డి ప్రారంభోత్సవం జరిపారు. ఈయనా ఒక మంచి సూచన చేశారు. రవీంద్రభారతి కేవలం లైటు చార్జీలు వసూలు చేసి, ప్రతి రాత్రి నాటకం ప్రదర్శించడానికి అనుమతి ఇవ్వాలని, అనుమతి కోసం నాటక సంస్థలు ఫ్రీ పాసులు ఇచ్చుకొనే దురవస్థ తొలగాలని ఆయన సూచించారు. ఈ సమాఖ్య ఏటా కనీసం ఐదు నాటకాలు ప్రదర్శించడానికి నిర్ణయించినట్లు ఆయా సంస్థల ప్రతినిధులు తెలిపారు. సమాఖ్య ప్రదర్శించిన కృష్ణతులాభారం నాటకం మనోహరంగా ఉంది. సత్యభామగా నటించిన శ్రీమతి షహీదా, నారద పాత్రధారి ప్రేక్షకులను తమ నటనతో విశేషంగా ఆకర్షించారు కాని రవీంద్ర భారతి నియమానికి విరుద్ధంగా గంటన్నర ప్రసంగాలు జరిగాయి.

## గురజాడ సారస్వతావలోకనం

హైదరాబాద్ అభ్యుదయ రచయితల సంఘం డిసెంబర్ 3 వ తేదీని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో గురజాడ అప్పారావును మరొక మారు నగర వాసులకు జ్ఞాపకం చేసి ఉత్తేజం కలిగించింది గురజాడ ఆధునికాంధ్ర కవితకు ఆద్యుడని ఆయన దేశమును ప్రేమించుమన్నా, అనే గీతం అంత







# మీరు చిన్నవారైనా, పెద్దవారైనాసరే మీకు జీవిత భీమా కావాలి

మీరెంత చిన్నవారైతే అంత తక్కువ ప్రీమియం చెల్లిస్తారు. మీకు ఇరవై ఆ ప్రాంతాల వయసున్నప్పుడు పోలసీ తీసుకుంటే మీరు నలభయ్యో పడిలో పడేసరికి — మీ పిల్లల చదువు, పెళ్లి అవసరాలొచ్చేసరికి ఆ పోలసీ పరిపక్వమై హాయిగా డబ్బు చేతికందుతుంది.

అంతేగాక, జీవిత భీమా మీలో ఆదాచేసే అలవాటును కలిగించి, నిశ్చలమైన, పరిపూర్ణమైన వారిగా మిమ్మల్ని రూపొందిస్తుంది.

జీవిత భీమా ఎప్పుడైనా చేయవచ్చు. జీవిత భీమా వలన మీరేవిధమైన ఆదాచేసే విధానంకన్న ఆకర్షణీయమైన పన్నుముదరాలు లభిస్తాయి. మీ ఎస్టేటు పన్నులు చెల్లించేందుకు అది తోడ్పడుతుంది.

మీ వయస్సు నలభై ఆ ప్రాంతాల అయితే మీరు హెచ్చు రాబడి ఆర్జిస్తూఉండి ఉంటారు. మీయొక్క సుఖమయమైన జీవనానికి ఎదురుచూడని సమస్యలపట్ల రక్షణకావాలి. అలాగే మీ పిల్లలకు, ఏ అవాంతరం రాకుండా జీవితం హాయిగా సాగే అనువుకావాలి.



## లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

## జీవిత భీమాతో సరితూగేది మరొకటిలేదు

daCunha/LIC/46

గోద్రెజ్ సోప్స్‌వారి 'కి' డిటర్జెంట్ పౌడరు విడుదల సందర్భంగా 19 వ తేదీన లేడి హైదరీక్లబ్, బషీర్‌బాగ్‌లో జరిగిన సమావేశంలో ప్రసంగిస్తున్న శ్రీయుతులు ఎ.కె. ఎస్. రావు (సేల్స్‌మేనేజరు) సినీ నటి జయచిత్ర, రచయిత్రి మాదిరెడ్డి సులోచన.

# హైద్రాబాద్ నోట్ బుక్

ర్జాతీయ గీతమని శ్రీ దాశరథి రంగాచార్యులు బహుముఖ ప్రజ్ఞగల గురజాడ వంటివాడు 20వ శతాబ్దంలో మరొకడు లేడని డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ, మన రచయితలు పలువురు వంటింటి పరిధిని దాటలేదని, గురజాడ కులమతాలకు అతీతుడైన కవి అని, రచనా సౌందర్యం వాస్తవికత వున్నందునే కన్యాశుల్కం నాటకం, సమస్య సమకాలీనం కాకపోయినా నేటికీ ఆస్వాద్యమానమవుతున్నదని శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి గురజాడ వ్యక్తిత్వ వైశిష్ట్యాన్ని గురించి గోష్ఠి ప్రారంభించిన శ్రీ దేవులపల్లి రామానుజరావు ప్రసంగించారు. అటు వీరేశలింగం గారి సంస్కరణ వాదాన్ని ఇటు గిడుగు రామమూర్తి పంతులుగారి వ్యవహార భాషా వాదాన్ని కలగలిపి సాహిత్యంతో అందజేసిన వాడు గురజాడ అని అధ్యక్షురాలు శ్రీమతి నాయన కృష్ణకుమారి గోష్ఠికి తలమానికంగా అన్నారు. అప్పుడప్పుడు ఇలాటి పున్యశ్రవణ కీర్తనాలవల్లనయినా మనలోని పరకాపుర ప్రవృత్తి తొలగుతుందని ఆశిద్దాం.

## మానవతా మూర్తి మండలి

హేమ్నకి సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపివా విప్పులో పడితేనేగాని బంగారు నిగ్గు తేలదు. అన్నాడు కాళిదాసు. మోచేతుల కిందికీ, మోకాళ్ల మీదికీ వ్రేలాడే ఖద్దరు చొక్కా వట్టి బూటకం అన్నారు. పూల దండలు వద్దు, పళ్లు ఇవ్వండి అని సలహాయిస్తే, ఏదో కొత్త సూచన చేసి సంప్రదాయాన్ని కాదని సూక్ష్మంలో గొప్పవాడు కావాలనే ఎత్తు అన్నారు. రాష్ట్రంలో విచ్ఛిన్నకర శక్తులు చెలరేగినప్పుడు తెలుగుజాతి ఒక్కటే విడిపోవడానికి వీలు లేదని ఎలుగెత్తి చాటిన మంత్రి కావడానికి మరొక పన్నాగమన్నారు. ఊరికి రానివ్వమన్నారు. ప్రపంచం నాలుగంచులా చెల్లా చెదరుగా వున్న తెలుగువారి భావసమైక్యానికి ప్రపంచ తెలుగు మహాసభలు ఏర్పాటు చేస్తే, అబ్బో! అంత ర్జాతీయ ఖ్యాతికి అంగలార్పు అని ముక్కు మూతి విరిచారు. అయినా శ్రీ మండలి వెంకట కృష్ణారావు మేరు నగంగా నిలబడ్డారు. ఆయనలో మానవతామూర్తి తుఫానులో బయటపడింది. తుఫాను తాడికి తనాతునకలైన తన దివి సీమను చూచి మండలి గుండెలు అవిసిపోయాయి. మృతుల అంత్య సంస్కారానికి మృతశేషుల భవిష్యావిష్కారానికి నడుం కట్టారు. లెక్కగొట్టడం కాదు. కావలసింది, వెచ్చని కన్నీరు కార్చడం అని నిరూపించారు. శవానికి సంస్కారం చేయడమే శివునికి ప్రీతి అని చాటారు. అలాటి వారిది ఏ పార్టీ కాదు మానవతా పార్టీ.

## ఉపశ్రుతి

కాంగ్రెస్ వాళ్లు ఇంతగా మల్లగుల్లాలు పడుతున్నారేమిటండీ? అనడిగాడు ఒక సామాన్యుడు. నాయనా వెనకటికి వెంకటేశానికి కూడ ఈ సందేహమే కలిగింది. గురువు గిరీశం ఏమన్నాడో తెలుసా? కాంగ్రెస్సంటే దివాన్‌గిరీ చెలాయించడం అని అన్నాడు. దివాన్‌గిరీ— మంత్రిత్వాలు పోయాయి. మరి మల్లగుల్లాలు పడక ఏంచేస్తారు? అన్నాడు ఒక తెలుగు పండితుడు.

— తిరుమల రామచంద్ర.



తాజా వెన్న, మాల్టు, చక్కని
మీగడ పాలు, తియ్యని
గ్లూకోజ్ చేరి గొప్ప
రుచినిచ్చే

# న్యూట్రిన్ ల్యాక్టో బాన్‌బాన్




పిల్లలూ! తాజావెన్న, మాల్ట్, గ్లూకోజ్, అపైన చిక్కటి పాలు. మ్...మ్...నోరు వూరుతుంది. లక్షలకొలది బాలలు ఈ రుచిని న్యూట్రిన్ లక్టో బాన్‌బాన్ నేతి మిఠాయిలో కనిపెట్టినారు.

CAS NC 10 TE 77

[illegible] మిఠాయి యందు
ఫలరస పూరిత విందు!




న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ లిమిటెడ్,
చిత్తూరు (ఆం.ప్ర)

హెచ్చరిక : ఈ బొమ్మ న్యూట్రిన్ మిఠాయివారి ట్రేడ్‌మార్కు.

# ఫాలాక్షుని డైరీ

## దోమల పార్సెల్ !

బెంగుళూరులో అచ్చయ్యే కన్నడ ప్రభ దిన పత్రిక ఆఫీసుకు ఓ వింత పార్సిలు వచ్చిందట. అది విప్పి చూస్తే లోపల చనిపోయిన దోమలున్నాయట. అవి యాభయి వేల దోమలనీ, ఆసుపత్రిలో తాను రోగిననీ, తన మంచం చుట్టూ ఆ ప్రభుత్వ ఆసుపత్రిలో తిరుగుతూ తన రక్తం కోసం ఎగిరి గంతులు వేసే దోమలలో పిత్తై వన్ని మాత్రమే పట్టగలిగాననీ అక్కడి (బెంగుళూరులో) ప్రభుత్వ ఆసుపత్రిలో ఓ రోగి ఆ పార్సెలు తో పాటు పెట్టి ఒక వుత్తరంలో వ్రాశాడట. బాబోయ్!! యాభయి వేల దోమలే! యస్సార్! ఆ మాత్రమే పట్టగలిగాడట.

## అల్లుడి మర్యాద !

కురుచ్చి అనే వూరికి చెందిన మారియప్పన్ అనే ఆతని భార్య గర్భవతి అయినందువల్ల ఆమె తల్లి ఆమెను తన వూరు తీసుకు పోయిందట. పెళ్ళాం వెళ్ళిన కొన్నాళ్ళకి మారియప్పన్ కూడా అత్తారింటికి చేరాడట. ముందు సకల మర్యాదలూ చేసి, ఆనకసలు అతను తిష్ట వేసుకున్నందువల్ల కూలి పనితో వచ్చే డబ్బులతో యిల్లే గడవనందు వల్లా అతని అత్తగారు మర్యాదో పిసరు తగ్గించి పొటుకు మాటలారంభించి, అవి పని చెయ్యనందువల్ల నేరుగా సిగ్గు లేదా! అని అల్లుడిని వాకబుచేసిందట. తను తన పెళ్ళాం వున్న చోటే వుంటానని ఆతడు కుండ పగలేసి చెప్పి పెళ్ళాన్ని తనతో వచ్చెయ్యమని చెయ్యబట్టుకు గుంజాడట. దీనికి అతని అత్తగారడ్డొచ్చే సరికా అల్లుడు అత్తనీ, భార్యను చితక బాదేశాడట. వారిద్దరూ ఆసుపత్రికి చేరారట. మరా అల్లుడో. . .

## అనాథ బస్సుల ఆక్రోశం !

తిరుచ్చిలోని గోడల మీద ఓ వింత వాల్ పోస్టర్ను ఎవరో అంటించారట. వాటి మీద మేము రాత్రనక, పగలనక మీ కోసం పని చేస్తాము. కానీ దేశంలో ఏ విధ్వంసం, విపరీతం జరిగినా మీరు మా మీదే దాడి చేస్తారు. మా ఒళ్ళు హూనం చేస్తారు. మమ్మ తగులబెట్టారు. దేశ పురోగతికి పాటుపడె మమ్మల్ని నాశనం చేస్తారు మీరు. మేమేం పాపం చేశాము. ఇట్లు: అనాథ బస్సులు అని వున్నదట.

## పిల్లలు పుట్టకుండా మందు తింటే ఒకేసారి ఆరుగురు పిల్లలు !

హాలండ్ దేశంలో సైమన్ విజాసెన్ అనే ఒకాయన భార్య 28 ఏళ్ళ ఆమెకు ఒకే కాన్పులో ఆరుగురు పిల్లలు పుట్టారట. అసలాయనామెకు పిల్లలు పుట్టకుండా వుండడానికి కొనిచ్చిన మందు తిన్న తరువాత ఈ కాన్పు జరిగింది. ఆ పిల్లలను తల్లినీ చూడ్డానికి జనం ఆసుపత్రి మీద విరగబడి పోతుంటే వారందరినీ అరికట్టడానికా ఆసుపత్రి డాక్టర్లో ఆలోచన చేసి, ఆ తల్లినీ, పిల్లనీ చూడాలని, ఫోటో తీయాలని వచ్చే పత్రికా విలేఖరులు, రెండు వేల డాలర్లు ఫీజుగా యివ్వాలన్నారట. దాంతో ఆసుపత్రి రద్దీ తగ్గిందట. ఆరుగురు పిల్లల్ని కని, ఆరుగురు క్షేమంగా వుండడమనే విషయం ప్రపంచంలో యిది రెండవ సారట.

## అమెరికాలో పదవీ విరమణ వయస్సు 78 స. లు !

అమెరికాలోని వ్యాపార సంస్థలలో పని చేసే వారి రిటైర్‌మెంట్ వయస్సు (పదవీవిరమణకాలము) 65 ఏళ్ళ నుంచి 78 ఏళ్ళ పెంచారట. అసలు ప్రభుత్వ రంగాలలో యీ వయస్సును గురించిన చట్టింపు యిప్పటికే నప్పజడుతున్నదట— చైగలిగినన్నాళ్ళు చై నారాజా పద్ధతిప్పుడాట.

## కాబరే పేరిట నగ్ననృత్యాలు !

సేలంలోని ఓ పెద్ద హోటలులో కాబరే నృత్యం పేర సుందరాంగులు ఎంచక్కా, హాయిగా విలాసంగా, సంపూర్ణ నగ్నంగా ఓ చిన్న పూలు పోగువంటి బట్ట అడ్డు పెట్టుకుంటున్నట్లు ఆడుతున్న సమయంలో పోలీసులు వారిని పట్టేశారట. ఈ పోలీసులింతే బాబు. పోని పూర్తిగా చూసైనా పట్టేయ్యరాదా ఏమి ! తప్పు. అప్పడి పోల్చుకూడదు.

## పుట్టింటి మోజు !

కృష్ణగిరికి చెందిన 23 ఏళ్ళ సరోజ అస్తమాను తన పుట్టింటికి వెళ్తుండేదట. ఆమె భర్త కిదిష్టం లేక మాటిమాటికీ, చీటికిమాటికీ మీ అమ్మ యింటికి పోవీల్లేదు అన్నాడట. ఒకసారి ఆ ఆజ్ఞను మీరి వెళ్ళేసరికి నానా తిట్లూ తిట్టేడట దాంతో ఆమెకు మనస్సు విరిగి పోయి, ఇంత విషం తెచ్చుకుని తనిద్దరి పిల్లలకూ చెరి కొంచెం పెట్టి, తానూ తిన్నదట. ఫలితంగా ముగ్గురూ చని పోయారట.

## కప్పకి ఆశ్రయం యిస్తే పాముకి ఆగ్రహం !

వాళపాడికి చెందిన కృష్ణాపురంలో కుళ్ళ గవుండర్ అనే ఓ లక్షాధికారి తన తమలపాకు తోటలో పచార్లు చేసి ఆకులు మడిచే పాకలో కూర్చుని ఓ దోత్తి సరి చూస్తుండగా ఓ కప్ప ఎగురుకుంటూ వచ్చి ఆతని కాలు వెనుక దాక్కుందట. అది గమనించి కూడా ఆయన దాన్ని తోసెయ్యలేదట. ఈ లోగా ఆ కప్పని తరుముకుంటూ వచ్చిన పాము బుస్సున లేచి అతని కాలు మీద కాటు వేసి పారిపోయిందట. చూస్తుండగానే కుళ్ళ గవుండర్ నురగలు కక్కుకుని చని పోయాడట.

# అష్టాదశ సంఖ్య







సంఖ్యలలో అష్టాదశ–18 అనే సంఖ్యకు మన దేశంలో ఎంతో ప్రాధాన్యంఉన్నది మనకు ముఖ్యమైన భారత, భాగవత, రామాయణాలలో భారతంలో ప్రధానమైన పర్వాలు– అది పర్వం మున్నగునవి పద్దెనిమిది. భారత యుద్ధంలో కౌరవుల పక్షాన 11 అక్షోహిణులు, పాండవుల పక్షాన 7 అక్షోహిణులు– మొత్తం 18 అక్షోహిణుల సైన్యం యుద్ధం చేసింది. ఆ యుద్ధం 18 రోజులు జరిగింది.

పరమ పవిత్రమైన భగవద్గీతలో 18 అధ్యాయాలు ఉన్నవి. మనకు విద్యలు కూడా పద్దెనిమిదే! అవి– ఋగ్యజుస్సామాథర్వణాలు నాలుగు వేదాలు, శిక్షా– వ్యాకరణ, ఛందస్సులు, నిరుక్త, జ్యోతిష కల్పాలు అనే ఆరు వేదాంగాలు, ధర్మశాస్త్ర, పురాణ, న్యాయ, మీమాంసలు నాలుగు, పధ్నాలుగు విద్యలు. వీటికి ఆయుర్వేదం, ధనుర్వేదం, అథర్వ విద్య, అర్ధశాస్త్రం కలిపితే పద్దెనిమిది విద్య లవుతాయి.

అష్టాదశ పురాణాలు, అష్టాదశ ఉప పురాణాలూ ప్రసిద్ధాలే. బ్రహ్మాండాదులు పెద్ద పురాణాలు. నార సింహాదులు ఉప పురాణాలు.

మహాకావ్యంలో పద్దెనిమిది వర్ణనలు ఉండాలని ఆలంకారికుల నియమం. అవి నగర,సముద్ర, శైల, సూర్య,చంద్రోదయ, ఋతు, జలక్రీడాదుల వర్ణనలు.

మనకు గోధుమ, పెసలు, కందులు మొదలైన నవధాన్యాలూ ప్రసిద్ధాలు గదా! నాటిలో చిన్న, పెద్దా భేదాలను బట్టి అష్టాదశధాన్యాలను మనవాళ్లు చెప్పారు ఈ ధాన్యాలు వేరొక విధంగా కూడా 18 కావచ్చు.

మనకు ప్రామాణికాలైన స్మృతులు– ధర్మశాస్త్ర గ్రంధాలు పద్దెనిమిది అవి మనుస్మృతి మొదలైనవి.

గ్రామం ఇతర ప్రాంతంమీద ఆధార పడకుండా ఉండాలంటే అందులో అష్టాదశ వర్ణాల వారూ ఉండవలసి ఉన్నది. బ్రాహ్మణాది చతుర్వర్ణాలు మాత్రమే కాదు. చాకలి, మంగలి, మేదరి, కమ్మరి, కుమ్మరి మున్నగు వృత్తుల వారందరూ ఉండాలి. అప్పుడే అది సరియైన గ్రామం అవుతుంది.

ఇంకా ఇట్టివి 18 సంఖ్యవి మరికొన్ని ఉండవచ్చు

ముఖ్యంగా చట్టం ప్రకారం చూస్తే మనిషికి 18 ఏళ్లు పూర్తి అయితే మైనారిటీ తీరుతుంది. మెజారిటీ వస్తుంది. అంటే ఆ వ్యక్తి స్వంతంగా తన వ్యవహారాలు చూచుకోవచ్చు నన్నమాట నవయౌవనం కూడా అప్పుడే ప్రారంభమవుతుంది.

---

## ప్రళయం!

సముద్రం ప్రశాంతంగా ఉంది.
అలలు లయబద్ధంగా ఉన్నాయి.
మలయ పవనంలా వీస్తోంది గాలి
ఇదే ఝంఝామారుత మవుతుందని,
కలలుగన్నా రెవరు ముందురోజు ?
తూరుపున దాగరంత మేఘంవేసి,
పెరిగి పెద్దదయి, మింగేస్తూంటూ
ముంచుకొచ్చింది కాలుడిలా
త్రేతాయుగపు బాలికవంటి ప్రకృతి
భయంకర రక్కసిగా మారింది.
వెండికొండలా అగపడి,
ముదిరి ముదిరి ముసురుకుంటూ
మీది మీదికి దూసుకొచ్చి,
నల్లగా, చిక్కటి చీకటిగా మారి,
సముద్రంలో అగ్నిపర్వతం పగిలి
మంటలతో ముంచు కొచ్చింది
ప్రళయకాల ఘోషతో,
వచ్చింది ఝంఝామారుతం
మహోత్తుంగ తరంగాలతో
సాగరుడు నేలని బలాత్కరించాడు.
ప్రళయం పరిమితి ఒక లిపా .?
సర్వనాశనం కావడానికి చాలని క్షణం!
కళ్లుమూసి తెరిచేలోగా,
కళ్లుమూసే రెండ రెందరో!

## ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

ఎక్కడదీ ఉప్పెన ఉప్పెన!
ఎక్కడదీ జలరాసి జలరాసి!
ఎక్కడవీ కెరటాలు కెరటాలు!
మానవుడికి యమ పాశాలు!
ఏం మిగిలిందేం మిగిలింది?
వెలుగు చీకటిని చంపి,
ఏం చూసిందేం చూసింది?
చీకట్లో వరుణుడు, వాయుదేవుడూ,
జరిపిన సామూహిక హత్యలు ,....,
బలాత్కారాలు..... అరాచకం!
మహా వ్యసనం! వల్లకాడు!
రాబందుల కూడు!
ఏం విప్పదేం విప్పది వెలుగు?
గుండెలు పగిలే మనిషి ఏడుపు—
బ్రహ్మాండం నిండే మానవశోకం!
ఏం మిగిలింది?
ఏం రగిలింది?
ఏం పగిలింది?
ఏం తగిలింది?
మిగిలింది మరుభూమి!
రగిలింది మానవ శోకం!
పగిలింది జీవన మధుభాండం!
తగిలింది మనిషికి శాపం!

మంధా వెంకటరావు (రూర్కెలా)

### అట్టమీదబొమ్మ

9–12–77 నాటి ఆంధ్రసచిత్రవారపత్రిక లోని నటి శకుంతల ముఖచిత్రం వయ్యారం ఒలక బోస్తున్నది. వీరాజీగారు వ్రాసిన తాజాకాలమ్‌లోని కోస్తాను కబళించిన తుఫాను రక్కసిని చదివిన ప్రతి ఆంధ్రపత్రిక అభిమాని కొంతవిరాళాలు ఇచ్చి మన తోటి సోదర, సోదరీమణుల గాయాన్ని ఓదుతా భక్తితో మాన్పడానికి ముందుకు రాగలరని ఆశిస్తున్నాను. ధారావాహిక కథ సుమారుగా వున్నది.

నేటి సమాజములో కాలేజి విద్యార్థుల, వారి దృక్పధాలు, అలవాట్లను పూర్తిగా తల్లిదండ్రులే మార్చలేరు, ఇది వాస్తవం. ఈ పరిణామాలు నేటికిన్ని కొన్ని ఇండ్లలో జరుగుతున్నదే. కాని సీరియల్స్ రాగబంధం లో విజయ పాత్ర, జీవన పోరాటంలో ఆశల ఆరాటం లో రాధలపాత్రలు మార్పు తెప్పించ గలరని రచయిత్రుల పై రెండు కాలేజీ అమ్మాయిల పాత్రలకు ఎంతో ప్రాముఖ్యం ఇచ్చి సీరియల్స్ చదువుతున్న కొద్దీ ఎంతో ఉత్సాహంగా వున్నది. ఇట్టి కథలను పాఠకులకు అందించిన పత్రికకు [illegible] దిస్తున్నాను మంచికార్యాన్ని పత్రిక [illegible]. కాని, [illegible] లో వేసి [illegible].

సి. యస్. దినేష్ కుమార్, (తిరుమల హిల్స్)

**కార్టూనులు**

రమేష్, కాటూరి గార్ల కార్టూనులు ఎంతో నవ్వు పుట్టిస్తున్నాయ్. మలేషియా తెలుగు సాంస్కృతి కోత్సవాలు ఉమాభారతి గారిని సన్మానించటం తెలుగుభారతికి గర్వకారణం — తెలుగుతల్లికి మరో పూదండ — బి.ఎన్. రెడ్డి గారి చలోక్తులు చాల బాగున్నాయ్. శ్రీ రెడ్డిగారు ఒక సూక్తి చలనచిత్ర రంగానికి సూచించారు. పూర్వం ఏదైనా సినిమా దెబ్బతిన్నదంటే అందులో పనిచేసిన వారందరూ సిగ్గుతో అవనతముఖులై ఉండేవారని, నేడు అది కానరావడం లేదని అన్నారు— ఇది ఎవరు గ్రహిస్తారు.

ఏ.పూర్ణచంద్రరావు, [విశాఖపట్నం.]



Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna




## ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

# సాలోఫేన్ ను వాడండి. అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర. వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా
నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ
వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా,
తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి. ఫ్లూ జ్వరాలకు
కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.
సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—ఏళ్లతరబడి
ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్
లిమిటెడ్ వారి తయారీ.

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

సాలోఫేన్